శ్రీరస్తు.    శుభమస్తు.

శ్రీ శివాయగురవే నమః

# మనవి

ఓనమాలు మొదలుగా నక్షర జ్ఞాన
సహిత శబ్ద భాషాసరణి నర్థ
సిద్ధి వెలయునటులఁ జేయు శ్రీగురువుల
పదములెదను దలఁతు భక్తియుక్తి.

షట్పదగీతము —

ఆంగ్ల మెఱుఁగ దెఱుఁగు సంస్కృతాంధ్రములను
జాతక ముహూర్త భాగముల్ జ్యోతిషమున
గణితమందు లీలావతిఘ్నుఁడు నాదు
తండ్రి రామయ్య గురుఁ డుపాధ్యాయపదవి
నంది గడియించెఁ గీర్తిధనాదులిలను
స్వర్గమును జేరె రౌద్రి సంవత్సరమున.

కం॥ బడి చదువు లాంగ్ల భాషయు
విడిచి కృతార్థతకు స్వకుల విద్యాదులు త
మ్ముఁడు నేను గఱచి పెద్దల
యడుగుల జాడలను జనుదు మలవడ సుఖముల్॥

శా॥ 'వేదోద్ధారక' రామచంద్రయతి స్థాపించెన్ సభాసంస్థయం
దేదో నిత్యము సత్కథాకథన మెంతే భక్తిఁ గావింప రా
రాదా నీవని స్వామివారు కరుణన్ రప్పించి గుంటూరు న
న్నాదేశించిరి యుండుమంచి రువద్వైదాఱేండ్లనాఁడిందునన్

ఉ॥ శ్రీ గురు రామచంద్రయతిశేఖరు నాజ్ఞ శిరోవిభూషగా
నేగృహిణీయుతుండనయి నిత్యముతత్పద భక్తిఁదత్పరా
బేగతి శాస్త్రలక్ష్యముల కిల్లన జెల్లునో మెల్ల మెల్లగా
నేగమనించి స్వామికరుణించిన దారిగమించువాఁడనై.

చ॥ నలువుర నోళ్ళయందుఁబడి నానకతిప్పదు మంచిచెడ్డలన్
మెలఁగినవానికెట్లుపరమించునరుండెది? కావునన్మహో
ఫలమననొప్పు స్వాత్మగత బంధవిముక్తికి యత్నమీఁగతిన్
సలుపుట శ్రేయమా విబుధసంతసమానను నిశ్చయంబునన్

ఆ॥ తెలిపి బ్రహ్మమనుచుఁ దేట తెల్లముగాఁగ
జాయమాయ యనుచు స్వానుభవము
సగుణనిర్గుణములు శతకరూపంబునఁ
దెలుఁగు పద్యములను దెలుపుకొంటి.

చ॥ గురుకరుణా కటాక్షముత్కృష్టమైన తెలుంగు దానిచేఁ
బరగినమేలెదో యనుభవంబున దాని నిజంబుఁ దెల్పఁగా
నిరతము వేదశాస్త్రసరణిన్బర మార్థసుఖంబుఁ గోరువా
రరసిగ్రహింపనౌననిక దా!సుకవుల్ రచియింత్రు గ్రంథముల్

శా॥ శ్రీహనుమత్ప్రసాదమ్ము భుజించిన నాతలిదండ్రులిచ్చిరీ
దేహము నాకు జన్మక్కడ తేరు విధంబును వర్తనంబు సం
దేహములేని యట్లుపదేశ మొనర్చిరి శ్రీగురూత్తముల్
సాహస ధైర్యసంపద లొసంగి కృపాపరిపూర్ణచిత్తులై.

ఉ॥ ఏనుఁబురాణముల్ నలుబదేడుల క్రిందట నెట్టులెట్టులో
పూనితిఁ జెప్పనప్పుడిది పూర్వకృతంబగు వాసనాబలం
బౌనవఁ దెల్గుపద్యములనల్లి కథాంశము వ్రాసికొంటి స
ద్ధాని సులక్షణాఖ్య చరితంబును నిప్పటికిట్లు చూచితిక్.

(శ్రీ) సులక్షణోపాఖ్యానము సంస్కృతిస్కాంద మహా పురాణాంతర్గత మాఘమాహాత్మ్యమున ౨౭-౨ వ. అధ్యాయములందలి కథ. నేను స్వగ్రామమగు గుంటూరుజిల్లా ప్రత్తిపాడునందు 1918సం॥రమునందుమాఘమాహాత్మ్యమును బురాణ నోరణిగాఁ జెప్పునప్పుడు తెలుఁగున నీకథ వ్రాయుమని నన్ను "అభినవజయదేవ" లగు బ్ర॥ శ్రీ॥ చల్లా పిచ్చయ్యశాస్త్రిగా రాదేశించిరి. వెంటనే శ్రీప్రసన్నాంజనేయస్వామిని గృతిపతిగ నొనర్చి తృతీయాశ్వాసమున సగమునఱకువ్రాసినకథ నప్పుడు చిత్తగించిన శ్రీరామకథామృతాద్యనేక గ్రంథ ప్రణేతలగు బ్ర॥ శ్రీ॥ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారీకథను బూర్తిగఁ వ్రాసిప్రకటింపుమని శాసించిరి. కాని యిప్పటివఱకట్లుగా జేయలేనైతిని.

1955 సం॥ రమున స్కాందమాఘపురాణ మాంధ్రీకరించి ప్రకటించిన 'కవితాకళానిధి' బ్ర॥ శ్రీ॥ పోతరాజు లక్ష్మీనరసింహ కవిసింహులును; శ్రీమద్గురు భాగవతాద్యనేక గ్రంథ కర్తలగు బ్ర॥ శ్రీ॥ మిన్నికంటి గురునాథశర్మ కవిశేఖరులును శ్రీసులక్షణోపాఖ్యానమును దిలకించి ప్రకటించుటకనుమతించి ప్రోత్సహించిరి.

1952 సం॥ రము నుండి శ్రీప్రసన్నాంజనేయాదులను దైవానుగ్రహమున వ్రాసిప్రకటించుటకు సంభవించినది శ్రీమ త్కోర్చి సవరణములు గావించుచున్న ఉభయభాషాప్రవీణ వేదాంతపారీణ, కవిశేఖర, శ్రీ మిన్నకంటి గురునాథశర్మగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

గీ॥ కలసిమెలఁగని తలవెంట్రుకలనుఁ గట్టి
బిడ్డయొడలునకనువైన గుడ్డఁజుట్టి
ముక్కుమొగములకుం దగుబొట్టుఁబెట్టి
పట్టివిడుతురు తమకూర్మిపట్టి జనులు.

ఉ. శ్రీ గురునాథశర్మకవిశేఖరులెంతయు శ్రద్ధఁబూని నా
పైఁగలకూర్మినిందుఁబొరఁబాటులనచ్చును వ్రాతముందులన్
బాగుగదిద్దినారు భగవంతుఁడువీరిని నింతకెక్కుడౌ
భోగయశోర్థసత్వగుణపూర్ణసుఖాయువులిచ్చి బ్రోచుతన్.

కవిత్వకథాంశములను తద్జ్ఞులగు రసజ్ఞులు విమర్శించి విశదీకరింపఁగలందులకుఁబ్రార్థితులు. వారికెంతయుఁగృతజ్ఞుఁడను.

ఈ సులక్షణోపాఖ్యానము త్రితీయాశ్వాసముపూర్తిగా వ్రాసివినిపించినంత నె సలక్షణముగ ముద్రించుటకగు ద్రవ్యము నంతయు నొసంగిన ఆర్యవైశ్య మిత్రరత్నమగు శ్రీయుత కొత్తూరు రామయ్య శ్రేష్ఠిగారికిని వారివారికిని సంపూర్ణాయు రారోగ్యభాగ్యయోగ్యకీర్తి ధన జ్ఞానానంద సంతానముల నొసంగఁగలందులకు నిత్యాభివృద్ధిగనఁ జేయఁగలందులకును శ్రీభగవంతుని బ్రార్థించెదను.

రచయిత
ప్రతాప హనుమయ్య



<table><tr><td>రచయిత<br>ప్రతాప హనుమయ్య.</td><td>ధర్మపత్ని<br>అన్నపూర్ణమ్మ</td></tr></table>

# తిలకము

శ్రీ సులక్షణోపాఖ్యానమును బ్రహ్మశ్రీ ప్రతాపహను మచ్ఛాస్త్రిగారు రచించిరి. వీరు 1894 సం॥ అక్టోబరు 20 వ తేదికి సరియగు శ్రీ జయనామసంవత్సరాశ్వయుజ కృష్ణసప్తమీ శని వారమున బునర్వసూనక్షత్రయుక్తకటకలగ్నమున నాదెమాం బాగామయ్యగారి పుణ్యదంపతులకు జనియించిరి. ఉపసదనవిధి భాష్యత్రయమునకు శాంతిఁ జెప్పిరి. శ్రీరామచంద్రేంద్ర సరస్వతీ యతీంద్రుల యనుగ్రహమునకుఁ బాత్రులై చిరకాలమునుండి బోధాచరణప్రచారణములచే గుంటూరులో సత్కాలక్షేపము సేయుచుండిరి. శ్రీశాస్త్రులవారత్యంత వినయమువాక్చమత్కా రము గలవారు. కానఁ గొన్ని యేండ్లనుఁకుఁ వారికడ కవితాకళ డాఁగియున్నదని యెఱుంగనైతి. "కవయస్తుప్రబంధారస్తేభవేయు శ్చతుర్విధాః ఉదాత్తఉద్ధతప్రౌఢోవినీత ఇతిభేదతః" అనెడు చతుర్విధకవులలో వీరువినీతకవులు. "వినీతోవినయం జల్పన్ స్వాపకర్ష ప్రకాశకమ్" అనికదా వినీత లక్షణము.

"వాచ్యానాం వాచకానాంచయదౌచిత్యేనయోజనం
రసాదివిషయేనైతత్కర్మముఖ్యం మహాకవేః"

కాన రచనకెట్టిశబ్దములావశ్యకములో యెట్టియర్థములు యోగ్యములోయెట్టిభావములు సముచితములో యట్టివానిని సంపాదించియిచ్చు నవనవోన్మేషశాలినియైన ప్రతిభయదృష్ట జన్యమైనది శాస్త్రులవారికిఁగలదు. దానికిఁదోడు వ్యుత్పత్తిని

సమధికముగాఁగూర్చుకొనిరి. పదార్థానోద్ధరణ స్థిరీకరణాదుల సిద్ధిని శతకములపైనభ్యాసముచేసి పడసిరి. ఇట్లు కావ్యరచనకు వలసినసామాగ్రిని సేకరించుకొన్న పిదపనితివృత్తము కావలసి వచ్చినది. మాఘమాహాత్మ్యముపురాణముచెప్పుచుండఁగానిరువదియేడవ యధ్యాయమున నీసులక్షణపభువుపై దృష్టిప్రస రించినది. తలపంకించినాఁడు. మనసునయోజించినాఁడు. నేఁటి కాలమున నుద్గ్రంథములు వ్రాయసమయము దొరకదు. దొరకి వ్రాసినఁ జదువుపరితలు లభింపరనుకొన్నాఁడు. చిన్నకావ్యమును భక్తిప్రధానమును రచింపనెదలోఁ బిచ్చికగూడు కట్టుకొన్నాఁడు. అయదనుసఁ బద్యాత్మకమా? గద్యాత్మకమా? ఉభయాత్మకమా!యనియుభావించినాఁడు. వెంటనే "గద్యానుబంధరసమిశ్రితపద్యసూక్తిః-హృద్యాహివాద్యకలయా కలితేవ గీతిః" అనుభోజఫణితిని స్మృతికిఁదెచ్చుకొన్నాఁడు. ఆంధ్రకవులందఱుంజన్నమార్గముననే తానునుబయనింప నుంకించినాఁడు ప్రతిపద్యముననేదేని విశేషముండునట్లు వ్రాయవలదా? యని యుఁదలపోయకపోలేదు. మహాకవిత్రివిక్రమభట్టు "కింకవేస్తస్య కావ్యేన-కింకాండేవధనుష్మతిః పరస్యహృదయేలగ్నం నఘూర్ణయతియచ్ఛిరః (నలచంపు 5) అనిచెప్పెఁగదాయని యనుకొన్నాఁడు. శక్తికొలఁదిప్రయత్నించిచూతమని సాహసించినాఁడు మూఁడాశ్వాసములగ్రంథము రచించినాఁడు. "ప్రసన్నాఃకాంతిహారిణ్యోనానాశ్లేష విచక్షణాః భవంతికస్యచిత్పుణ్యైర్ముఖే వాచోగృహేస్త్రియః."

అంగదేశప్రభువగు సులక్షణునకు నూఱుగురు భార్యలు గలరు. అందొక్కతెకును సంతతికల్గమి నృపుండు విచారించి మునులకడకరిగి వేఁడుకోనఁగా వారొక్కఫలమిచ్చి పంపిరి. దానినినృపుండు తెచ్చి పెట్టెలోఁబెట్టనెవరుఁ గనకుండ రాజు కనిష్ఠపత్ని దానిని భుజించి గర్భిణియయ్యె. అది యన్యకాంత లెఱింగి యసూయచేనామెకు మందువెట్టనామె మతిచలించి యడవులపాలై బిడ్డంగని పులివాతంబడె. ఆబిడ్డఁడే సుధర్ముఁడు వానిని హంసపోషించె. ఆవల వాఁడొకమునికి దొరకి వాని భార్యలచేతను బరిత్యక్తుఁడై చివరకు శ్రీహరియనుగ్రహముం బొంది తండ్రిం జేరును. ఇది యిందలి కథ.

ఇందుభక్తి తొణికిసలాడు చుండును. ధారకుంటులేక పరుగులెత్తుచుండును. శృంగారము పొంగారలేదు. దూరాన్వయము తొంగిచూడలేదు. ఓజస్సు తేజస్సు చూపలేదు. మాధుర్యము బాధిర్యము గనలేదు. ఇందలిసన్నివేశములద్భుతములు. కథలోచమత్కారము లేకున్న నేమి? ఇందలిపద్యములు హృదయమును గదలింపఁగలవు. మెదటిని మెదలింపకున్న నేమి ? చూడుఁడు 'దేవరవారికిఁదోఁచిన-దేవరమని' (15 పుట) "కని యెట్టి పుణ్యులీచ-క్కని' -- (46 పు) ఇత్యాదియమకములు "అందములసీమ మరుమామ చందమామ" వంటి యంత్యప్రాసములు 'కన్నసుతునిమోముఁగన్న వెన్నెలతేనికన్న మిన్న వన్నెనున్నఁగన్న'(41 పు) వంటి వృత్త్యను ప్రాసములు కోకొ

ల్లలు. అర్థాలంకారములును నుచితస్థలముల మిణుకుమిణుకు మనుచు మెఱయుచున్నవి. 'శుభస్యశీఘ్రమ్మటంచు' (16 పు) 'అభావేవిరక్తి' (43పు) ఇంతబ్రదుకుబ్రదికియింటివెన్కనునక్కె (64 పు) తేనెపూసిన ఖడ్గంబు... (37 పు) మున్నగు సంస్కృతాంధ్రలోకోక్తు లందందు ముచ్చటలాడుకొను చున్నవి.

వీరుచేసినవర్ణనలును గధావస్తువును ధ్వనింపంజేయుచు నాంతర్యమునావరించు కొనును. 'తేరికొక్కటియె కల్లగుటన్ గిరినుండిజాఱఁగా పడిగరథంబుతో నచటివారిధి యందునఁ గూలెనాతఁడున్ ... (16 పు) అనెడి సూర్యపతనమురాజొక్క భార్య మూలకమునఁ బెద్ద యాపదలోఁగూలు ననుటను సూచించు చున్నది.

'పగలు మెలఁగు హరికిభయపడిపర్వతకాననాంతరములఁ గలఁగిడాఁగి' 16 పు. అనునంధకారవర్ణనము రాజకనిష్ఠపత్నిసపత్నులపగలవలన నడవులంబట్టుటనుస్ఫురింపఁజేయును. 'సమయ కిరాతుఁడు పగగొనితిమిరమదేభంబు శిరముదెగ్లెఁగనేయన్- సుమనఃపథమున కెగసిన- సుమహితమౌక్తికములనఁగఁ జుక్కలు తోఁచెన్' 17 పు. ఇదియు రాజభార్యయుక్తకాలమునఁ దేజో రాశియగుబాలుం బ్రసవించి పులివాతంబడఁ దెల్లనియంచలు శిశువుంబెంచుటను దెలుపును. ఇట్లు వీరివర్ణనములు చమత్కార గర్భితములై వ్యంగ్యమర్యాదనాదరించుచు నానందముగొల్పు చున్నవి.

వీరిది తు-చ- తప్పనియనువాదము. ఐననుదొంటికవుల దారింబట్టి రసౌచిత్యములఁబాటించి స్వీయభావ రత్నములం బొదగకపోలేదు. అట్లు చేయవలయుఁగూడ. లేదేనిగావ్యేందిర యస్థిపంజరమువలెఁ దయారగును. రాజుసంతతిలేమికి విచారించుట, మంత్రులతో నాలోచించుట మునికిరాజసుతుఁడు లభించుట, మున్నగుఘట్టములు సముజ్జ్వలములుగా నున్నవి.

అట్లువ్రాసియు వీరేలొకో కావ్యదృష్టితోఁ గథలోనం దాదు నావశ్యకములైన తావులయందైనఁ జిఱుమార్పులఁజేయ లేదు. "చిత్తవిభ్రమదోషేణ- మహాఘోరాటవీంయయౌ" అనియుండ వీరునట్లే వ్రాసిరి కాని రసపుష్టికై సనతులడవులకు నెట్టిరనలేదు. మూలమందు లేమి భక్తిరత్నమగు సుధర్ముని మాతకుఁగథలోనధికవ్యాప్తిగల రాజపత్నికిఁబేరైనంబెట్టలేదు.

మూలమందు మునులనియుండ వీరునట్లేవ్రాసిరి. కాని ఫలమొక్కముని యిచ్చియుండుంగాని పెక్కురెట్లిత్తురు ? అట్టి పుత్త్రప్రదమైన ఫలమొసంగిన మునిపేరుఁ దెలుపలేదు. పోనిం డయ్యలంతుల కేమి ? అదివారియిష్టము.

"తులసీదర్శనస్పర్శాత్ సంగతస్తచ్ఛిశోరపిబుద్ధి రాసీత్తతోవిప్ర - తద్విష్ణోర్నామకీర్తనే - కృష్ణేతి వాసుదేవేతి - గోవిందేత్యచ్యుతేతిచ ... " అని మూలమందుండ వీరునట్లే వ్రాసిరి. ఈ బాలుఁడున్నది నిర్జనవనమందు. పెంచుచున్నది మానవభాషరాని పక్షులు. వయసా చిన్నది. చదువా లేదు.

వినుకలియా వెలయదు. కనుకలియా కానరాదు. తులసీదర్శన స్పర్శనముల వలనఁబాపములు తొలఁగవచ్చు. పుణ్యములు రావచ్చు. అదృష్టములు కాన వానింగూర్చి వాయెత్తలేము కాని యెంతపూర్వవాసనల మనమంగీకరించు వారమైనను ననిమిత్తముగా "హరినారాయణ వాసుదేవ నృహరీ యజ్ఞేశ దామోదరా ... యంచున్ననిన్ - జరియింపం దొడఁగెన్ నృపాత్మజుఁడు తత్సంకీర్తనానందుఁడై" అనివ్రాయుట పౌరాణికులకు భక్తకవులకే చెల్లును. "భక్తిసంపల్లలితుండతండు నొక ప్రాకృతబాలుఁడెయెంచిచూడఁగన్"అనిమన శాస్త్రిలుగారును నేతద్విషయమున నించుకశంకించి సమాధానమిడిరి. అప్పటికిని రసికులు తలలూఁపరని కాఁబోలు మూలమందు లేకున్నను 'ఆది మునీంద్రులైన సనకాదులు పర్వతనారదాదులున్ ... వానికి సాటివత్తురా ?" అని వాకొనినారు. తత్సందర్భమునఁబోతనామాత్యునివలె "భవబంధవల్లికానివహాలవిత్రంబు ..." ఇత్యాదిగా భక్తినిబ్రశంసించిరి. 'చలమునననుడాసి జలరాశి చొరరాదు నిగిడిగోత్రముదండనిలువరాదు...' అని దశమస్కంధమందుండ వీరును 'విధివిహితంబ వారిధిఁ జొచ్చి మెలఁగుట ? కొండకిందను జేరి పండుకొనుట...' 57 పు. అని దశావతారములు స్ఫురింపవ్యాజస్తుతిని సుధర్మునిచేఁజేయించిరి. ఇట్టియన్యగ్రంథసంవాదములిందందందుఁ గలవు. ఉన్ననేమి? ఉక్తివైచిత్రియే వానికి నూతనశోభ నాపాదించును. కలరుగాపాదోపజీవులు పద్యోపజీవులు ఛాయోపజీవులు మున్నగువారు కవికంఠాభరణాదులలో.

"అమ్లానసుమపల్లవామృత ఫలశోభితాఖిలవృక్షలతాది యుతము— 24 పు. సౌధాగ్రరాజితస్వర్ణాబ్జములుపట్టు హరి దంతి సురదీర్ఘికాబ్జములని 6 పు. మున్నగు నెన్నేని పద్యములు పూర్వకావ్యములఁ దలంపునకుం దెచ్చెడిని.

ఇందుఁదులసీ మాహాత్మ్యము మాఘస్నాన మహిమయు వర్ణితములు. మఱియు భక్తిజ్ఞాన వైరాగ్యోపదేశములును గలవు. భగవత్స్తోత్రములు దండకాదులుం గలవు. ఒకఁడేమి యీగ్రంథమాస్తికులకొక యాస్తి.

శ్రీశాస్త్రులవారెప్పుడునుబరగుణపరమాణువులఁ బర్వత ములఁజేసి ప్రశంసించుచుందురు. అది వారిస్వభావము. 'సౌజ న్యామృతసింధవః పరహితప్రారబ్ధ వీరవ్రతాః వాచాలః పర వర్ణనే నిజగుణాలాపేచ మౌనవ్రతాః.'

ఇట్టి శాస్త్రులవారిసంగాతము లభించుటచేతను, సులక్షణ కృతిలక్ష్మికిఁ దిలకముదిద్దు నవకాశమిచ్చుట చేతనుధన్యుఁడను.

ఇంకొకటి. కవులకు గ్రంథముద్రణము కడుదొడ్డపని. అది ధనవంతులు సదాశయులుఁగవితాకళాప్రియులుయశో భిలాషులు చేయవలసినపని. కాననే శ్రీ కొత్తూరు రామయ్య శ్రేష్ఠిగారు శ్రీ శాస్త్రులవారి గ్రంథముద్రణ విషయము చెవిఁ బడుటతోడనే యీ సదవకాశమును జాఱవిడువరాదని వెంటనే యాభారము సంతోషముతో వహించిధన్యులైరి. ఇట్టి యదృష్ట మెల్లరకులభింపదు. వీరికుటుంబమునుహరిహరనాథుఁడు రక్షిం చుచుండుఁగాక.

విలంబ
విజయదశమి

మిన్నికంటి గురునాథశర్మ
గుంటూరు

# ముద్రాపక ప్రశంస

వసుధ శ్రీ భారతీయార్యవైశ్య వంశ
వార్ధిసంభవ, పరమపావన చరిత్రి
కన్యకాపరమేశ్వరీ కరుణవలన
ధన్యులైరి నూటొక్క గోత్రిజులు ద్విజులు

గీ. వారియందున బెదనందిపాడునందు
భవ్యనాభిళ్ల గోత్రి దంపతులయందు
కొత్త శేషమ్మ సుబ్రాయకొడుకనంగ
బుట్టె రామయ్య సద్గుణమూర్తియగుచు

క. ఈరామయ్యయె దత్తుకు
మారుఁడు కొత్తూరు వంశమండనునకు వ్యా
పారునకనంత సెట్టికిఁ
జేరువ పుసులూరునన్వసించెడు ధనికిన్

క. సమ్మతిగల లక్ష్మీనర
సమ్మయుఁదనదత్తుతల్లి సంతోషింపన్
నెమ్మదినొప్ప మహాల
క్ష్మమ్మను రామయ్య పెండ్లియాడెను గూర్మిన్

గీ. అమ్మహాలక్ష్మియందు రామయ్యగుప్త
తనయులైదుగురిని నొక్క తనయుఁగనియెఁ
లలి పునగశిలగోత్రి పౌలస్త్య ఋషియు
వెలయు కొత్తూరువంశంబు వృద్ధినెసఁగ

క. శ్రీరామభక్తుఁడు గురుగుణ
ధీరుఁడు కొత్తూరువంశతిలకుఁడు పరమో
దారుఁడు వైశ్యకులా లం
కారుఁడు రామయ్యగుప్త గర్తపురమునన్

ఆ. కొత్తపేటయందుఁ గుదిరికగలయింట
రామచంద్రమూర్తి రక్షకుఁడుగ
దానధర్మపరతిఁ దనకుటుంబముతో ని
వాసముండు రామభవనమదియు

మ. భగవద్భక్తులఁగూడి కార్యములలోఁ బాల్గొంచుసత్పాత్రము
న్దొగిదానంబొనరించుచ్చున్ననమునందుత్సాహధైర్యాదులున్
దగురీతిన్బరిగొల్పసంతతము శ్రద్ధాభక్తులొప్పంగ నీ
జగమున్ రామయగుప్తశ్రీహరివిలాసంబంచునుప్పొంగెడున్

క. శ్రీదేవీ నవరాత్రుల
సాదరముగఁబిలిచి వేదశాస్త్రజ్ఞులకున్
మోదంబున నొసఁగును ద్ర
వ్యాదులరామయ్య గుప్త యనుపమభక్తిన్

చ. నిరుడును ముందటేడువలెనేఁ బిలువంబడియేగనాకు సా
దరమున నిచ్చెబండిత సదస్యమునన్గురుభక్తి దక్షిణన్
గరమనురక్తిఁదానిఁగొని గ్రంథము ముద్రణచేయఁగోర స
త్వరముగ రామయార్యుఁడుకథాక్రమమున్వినఁగోరెఁబ్రీతిమై

ఉ. అంతట ద్వితీయ భాగముకథాంశము పూర్తి రచించి నేను వృ
త్తాంత మెఱుంగఁ జేసినముదంబున రామయగుప్త గ్రంథము న్
సాంతము నాలుగైదు దినసంబులు భక్తి సతీసుతాదులున్
సంతసమందుచుండ సరసంబగురీతి వినెన్ శుభంబనన్

సీ. శ్రీ మహాలక్ష్మ్యమ్మ సేవింప రామయ్య
శ్రేష్ఠి సీతారామ సేవఁ జేయు
చెలఁగు సీతారామ సేవా మహాభాగ్య
మున ననువర్తక ధర్మములను సలుపు
వర్తక ధర్మసంప్రాప్త ధనంబున
సాధుమనీషి పోషణ మొనర్చు
సాధుమనీషిపోషణ పుణ్యఫలముల
నాత్మబంధువులకు నందనిచ్చు

గీ. ఆత్మబంధువులను ముఖ్యమైతనర్చు
కొడుకుఁ గోడలు నల్లుండ్రుఁ గూఁతులుమఱి
మనుమలున్మనుమరాండ్రును మనములంగు
సంతసింపంగ నానంద సౌఖ్యమందు.

ఆ. ధర్మసంస్థలకును దగినంత ధనమిచ్చు
మెచ్చుఁ గోరఁడిచ్చి నొచ్చుకొనఁడు
సతియుసుతుఁడు దనకు సహకారులగుచుండ
రామయార్యవైశ్యరత్న మెపుడు.

సీ. శ్రీజనార్దనకర్మ స శ్రీజనార్దనగుప్త
బుద్ధిమంతుఁ డెవని పుత్త్రుఁడయ్యె
శ్రీలలితాదయ శ్రీలలితాదేవి
గుణవతియెవ్వాని కోడలయ్యె



ప్రకాశకులు
కొత్తూరు రామయ్య శ్రేష్ఠి

ధర్మపత్ని
మహాలక్ష్మమ్మ



శ్రేష్ఠి దంపతుల
కొడుకు జనార్దనగుప్త. కోడలు లలితాదేవి. మనుమడు
బాలకృష్ణుడు. మనుమరాలు శ్యామలాదేవి.

శ్యామలా దేవిప్రసాదిని శ్యామలా
దేవియెవ్వాని పౌత్రియునయ్యె
శ్రీకృష్ణకరుణావిశేషజన్ముఁడు ముద్దు
బాలకృష్ణుఁడెవని పౌత్త్రుఁడయ్యె
గీ. సతఁడుశ్రీమహాలక్ష్మిభార్యాన్వితుండు
నార్యవిశుఁడు కొత్తూరు రామయ్య శ్రేష్ఠి
యచ్చువేయించెగ్రంథ సహస్రమధిక
భక్తి నిదియమూల్యంబని ప్రకటముగను
గీ. జనుల నెప్పుడు గరుణారసమునఁదడుపు
దైవతంబగు శ్రీజనార్దనుఁడు హరియు
ఈజనార్దనగుప్త తానెపుడు బీద
సాదలన్నప్పుదయుఁ బేరుసార్థకముగ
సీ. వేదశాస్త్రపురాణ విశ్వాసమే నాల్గు
పురుషార్థములుపండుభూమి సుమ్ము
స్వకులాశ్రమాచార వర్తనమే సర్వ
కాలమనోరథ కల్పకమ్ము
శ్రీమద్గురూపదేశిత మంత్రి లక్ష్యమే
సకలాపదుద్ధార సాధనమ్ము
సాధువిద్వజ్జన సంతోషకృత్యమే
నిరతిశయానంద నిధిసమమ్ము
తే. అనుచుబల్కుదు రార్యులు ఘనులు స్వాను
భవము భారతీయులకు మేల్వలచి తఱిని
నమృతధారలఁగురియు నట్లనవరతము
అఖిలసజ్జనగోష్ఠి ! రామయ్య శ్రేష్ఠి!!

సీ. సతతంబు శుభకార్యసంతోష సంతాన
ములు మీగృహంబునఁ జెలఁగుచుండు
నిరతంబు దేవ భూసుర ధేను పూజనో
త్సవములొప్పెడును మీభవనమందు
ననిశంబుబంధుమిత్రాళితో విందులు
జరుగు మీయింట నుత్సాహమలర
నిత్యంబుసద్గోష్ఠి నెసఁగు విద్వత్సాధు
బృందాశ్రయంబు మీ మందిరంబు

తే. సర్వకాలంబు శ్రీరామచంద్రమూర్తి
సపరివారముగను భవత్సదనమందు
నిలిచి, మీభక్తిసేవలకలరి మిమ్ముఁ
బరమకారుణ్యదృష్టిఁ గాపాడుచుండు

ఇంతకధికంబుగాఁ బరమేశ్వరుం డొ
సంగు దీర్ఘాయురారోగ్య సంతతులను
వస్తువాహనసుగుణ సంపదలనెల్ల
మోదమొదవమీరి కుటుంబమునకు నెపుడు

కృతిపతి శ్రీహనుమత్కృపఁ
గృతిప్రకాశకులుఁ గృతియుఁ గృతిపాఠకులున్
క్షితిఁగలకాలం బలరుదు
రతులయశోధన సుఖాయురారోగ్యములన్

విళంబి ముక్కోటి — రచయిత

ది. 21-12-1958 — ప్రతాప హనుమయ్య

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము





శ్రీరస్తు　　　　　　　　శుభమస్తు

శ్రీ శివాయగురవేనమః

# శ్రీ సులక్షణోపాఖ్యానము

## ప్రథమాశ్వాసము

శ్రీరామామణి వక్షమందునను గౌరిన్వామ దేహంబునన్
నారీరత్నము వాణి వాక్కునను విన్నాణంబుగాఁ జేర్చి, స
త్కారుణ్యామృతవృష్టి సంతతము భక్తశ్రేణుల న్దన్పువ్యా
పారుల్గూర్తురుగావుతన్ హరిహరబ్రహ్మల్మదిష్టార్థముల్.

చ. తొలుతనుతింతుఁ గేల్మిగిచితోరపుభక్తినినంతరాయముల్
తొలఁగఁగఁజేసి, మత్కృతికిఁదోడ్పడిభవ్యమొసంగిబ్రోవగా
నెలుకలతేనివారువము నెక్కిచరించెడు మేటిరాతు, బూ
చులయెకిమీనిబిడ్డ గుహుసోదరు నేనుఁగుమోము దేవరన్.

ఉ. వాణిని నక్షదామ శుకవారిజ పుస్తక దివ్యవల్లకీ
పాణిని, నమ్రభావసుర వారిజనేత్ర శిరోవిభూష ణ
శ్రేణివిరాజితాంఘ్రి సరసీజజితారుణ దివ్యపల్లవ
శ్రేణి వినీలవేణి సరసీరుహ సంభవురాణిఁ గొల్చెదన్.

ఉ. కావ్యమనంగ నెట్టిదొ నిఘంటువులెట్టివొ నేనెఱుంగ, నీ
దివ్యపదాంబుజంబులె మదిన్నెలకొల్పి భవత్కృపాప్తిచే
భవ్యకథాప్రకల్పనకుఁ బొల్పడినాడ బుధాళికెంతయున్
శ్రావ్యములై తనర్చు సరసమ్మగుపల్కుల నిమ్ము భారతీ.

క. శ్రీరామచంద్రపద సర
సీరుహమకరందపాయి చిత్తభ్రమరున్
కారుణ్యాకరు లంఘిత
వారిధి రిపుజలద పవను వాయుజుఁదలఁతున్.

తే. జ్ఞానహీనాంధపటలమ్మోసంగు నెడల
నయనయుగ్మమ్ము జ్ఞానాంజనమ్మొసఁగి
తెలుపి సర్వపదార్థముల్దేటపడఁగఁ
గనఁగఁజేయు రామగురు మజ్జనకుఁ దలతు.

తే. ఆదిమకవీంద్రు వాల్మీకి వ్యాసుకవిఁ
గాళిదాసాది గీర్వాణ కవులఁదలఁచి
నన్నయాదులఁ గీర్తించి సన్నుతింతు
సరసతిరుపతి వేంకటేశ్వరుల మదిని.

తే. క్షీరమున నీరొకించుక చేరియున్న
నీరువిడనాడి క్షీరము నెమ్మిఁ గ్రోలు
రాజహంసంబులగు కవిరాజ గణము
నెంతుఁ గాకవిగణముఁ గావింతురంతు.

వ॥ ఇట్లు మదీయేష్ట దేవతావందనంబును శ్రీగురుప్రార్థనంబును
మహాకవి స్తవంబును గావించి.

తే. "సప్తసంతానములలోఁ బ్రశస్తిఁగాంచి"
ధరణియందున నాచంద్రతారకముగ
నిలుచు సత్కృతియొక్కఁడె నిక్కమింత
యనుచుఁదలపోసి కృతిపతి నరయునంత.

చ. అనుపమబుద్ధిశాలి సకలాగమశాస్త్ర విదుండుసాహితీ
ధనుఁడు శతావధాని కవితావిభవోజ్జ్వలుఁడార్యసమ్మతుం
డనఘుఁడు శాంతమూర్తి సుగుణాకరుఁడంచితప్రేమ 'నంజనీ
తనయుఁడుపాస్యదైవతమతండుభవత్కృతినాథుఁ'డంచుఁదా.

క. చల్లనిచూపులననుఁగని
చల్లాపిచ్చయ్యశాస్త్రి సదయహృదయుఁడై
యుల్లాస మొనరకవితా
సల్లాపంబలరఁబలికె సముచితరీతిన్.

క. పలికినవిని ముదమందుచుఁ
బలికెదహనుమంతుఁ గృతికిఁ బతిగానని నేఁ
బలికిన భవహరమగునని
పలికిరిశ్రీశాస్త్రిగారుభవ్యంబనుచున్.

వ॥ అట్లగుటంజేసి



# షష్ఠ్యంతములు

క. శ్రీరామభక్త వరునకుఁ
దారకశుభనామ భక్తి తాత్పర్యునకున్
ఘోరారి గహన కీలికి
వారిధిగంభీరునకును వాయుసుతునకున్.

క. ఖండిత రిపునకు దోర్బల
మండనునకు భక్తజలజ మార్తాండునకున్
భండనభీమునకు మహో
ద్దండదశగ్రీవ సైన్యదండధరునకున్.

క. మైరావణజీవానిల
ఘోరాహికి దనుజనిచయ కుంజర హరికిన్
ధీరాగ్రేసరునకు జిత
మారునకును భక్తలోకమందారునకున్.

క. భూతప్రేత పిశాచ
వ్రాతోరగదనుజ యక్షరాక్షసమారో
ద్భూతాఖిలబాధా సం
ఘాతాగ్నివినాశవృష్టి కార్యఘనునకున్.

క. సకలాగమమూర్ధ వేదికి
ప్రకటత్రిమూర్త్యాత్మకునకు బ్రహ్మణ్యునకున్
చకితావనాదిసుగుణ ని
ధికిని ప్రసన్నాంజనేయ దేవవిభునకున్.

వ. సమర్పణంబుగా నాయొనర్పం బూనిన శ్రీమచ్ఛంక రోది తమ్మును స్కాందమహాపురాణాంత ర్గతమ్మును మాఘ మాహాత్మ్యప్రశంసాకథనమ్మును విష్ణుకథాప్రధానమ్మును నగు శ్రీసులక్షణోపాఖ్యానమ్మునకుఁగథా క్రమంబెట్టిదనిన

## కథా ప్రారంభము

శ్రీరజతాచలేంద్ర శిఖరిన్గిరిజాపతి తొల్లి గౌరికిన్
శ్రీరమణ ప్రభావమును జెప్పుచు భానుఁడు మాఘమందునన్
వారి చరస్థితుండయిన వారినిఁగ్రుంకి నృపాత్మజుంబలెన్
జేరుదురెల్ల వారలును శ్రీహరి మందిరమంచుఁబల్కఁనన్.

తే. ఏనృపాలాత్మ జుండతండేమి కతన
మాఘమజ్జన మొనరించె? మాధవుండు
బ్రీతుఁడెట్లయ్యెఁ దెల్పుఁడు విస్తరించి
యనుచు వేడిన నుమకునిట్లనియె శివుఁడు.

మ. కలదా కాశధునీజలార్ద్రి తలసత్కల్యాణ సౌధాగ్రభూ
లలితంబున్ నవరత్న సంఘటితసాలప్రస్ఫురత్కాంతిసం
కలితంబున్ వరమత్త వారణ జవాశ్వస్యందనానేక సం
కలితంబున్ వసుధాపురంబనఁ గనొక్కండంగ దేశంబునన్.

చ. ఖగపతినెక్కి కృష్ణుఁడు జగంబులరక్షణకేగివచ్చి యు
న్నగర సమావృతంబగు ఘనంబగుఖేయముఁగాంచిద్వారకా

నగరమటం చడిగ్గి స్వజనంబును గానమిఁగల్గు సిగ్గుఁజీ
ర్ణగవునఁగప్పుచున్ జనుఁబిఱానఁబురీవిభవంబు మెచ్చుచున్

సీ. సౌధాగ్రి రాజితస్వర్ణాబ్జములు పట్టు
హరిదంతి సురదీర్ఘి కాబ్జములని
ప్రాసాద శుభసాలభంజికలను బిత్త్రు
స్వర్బాలికలు తోడి బాలికలని
హార్మ్యాంగనాగాన మాలించు సురమాని
గీర్వాణవీణా సుగీతములని
అంతఃపుర ద్వారహారులఁ జెల్మిని జీరు
సప్తాశ్వములు కులజాతములని

తే. అచటి మేడలపని తనమరసి దేవ
శిల్పిమది మెచ్చుచుండు విచిత్రితగతి
అమరులప్పుడి రాణ్మందిరములు సొచ్చి
యరుగుదురు తారుమారై గృహంబులకును.

ఉ. ఎత్తగుగుళ్లు గోపురములెంతయు బాటకునడ్డమంచు న
ప్పొత్తన వాడఁబో వెఱచి పక్కలకుంగదియించి తేరుజా
గ్రత్తగఁ బోవనిచ్చు నటుగాదనినన్ బ్రతివత్సరంబుదా
నుత్తర దక్షిణాయనములొప్పఁజరించుట దేల భానుఁడున్

క. అన్నగరి నున్న యేనుఁగు
గున్నలు మిన్నేటఁదనరు కోమల దళసం
పన్నములగు తామరలను
గ్రిన్నన విదళించి నిజకరంబు లదుర్చుచున్.

క. హరిహరులు పూర్వపశ్చిమ
గిరుల నడుమ బరుగులిడుట కేయుని నగియ
ప్పురి గల తురగంబులు స
త్వరముగ నలుదెసలుఁగలయఁ బరుగిడి వచ్చున్.

సీ. అచటిసద్ద్విజుల స్వాహాకారముల్ విని
చతురాననుండయ్యె జలజభవుఁడు
అచటిరాజుల ధనుర్జ్యారావ మాలించి
జపము సేయఁగఁబూనె జామదగ్ని
అచటి వైశ్యులరత్న నిచయంబులను గాంచి
భిక్షు చెల్మినొనర్చె యక్ష విభుఁడు
అచటి పాదజుల ధాన్యంపుదిప్పలు చూచి
ముసలి నామంబున బొలిచె హలియు

తే. అచటి పూబోండ్ల లావణ్య మరసిరతి య
నంగుఁజే పట్టి దివిని మెలంగఁ జొచ్చె
నచటఁగల్గిన వస్తువాహనములరయ
సమతకోర్వవు పుణ్య విస్తార మేమొ ?

అప్పురిపువ్వుఁబోండ్లు కుసుమాస్త్రనిమూలబలంబుతోడఁజ
న్నప్పుడె గెల్చిరెట్లనిన నాతని గానులఁజిల్కఁ బల్కులన్
గొప్పులఁ దేంట్లఁగన్నులఁగోయిలమోములఁజన్దు మేనులన్
గుప్పెడు తావిఁగాలిఁ జెఱకున్మృదువా తెఱలన్ జలంబునన్

మ. చెలి! పూబంతుల కేమి విల్వ? సఖుఁడా చేపట్ట కీనేర్తువా?
కలవా? పొన్నలుచూడుమింటగలవింకన్ జాతులన్జూపు దే?
కలయిండ్లంగన రాదె యంచు బురివేడ్కన్నర్మ గర్భంబుగా
నల రుల్లోల్తురు పుష్పలావికలు నిత్యంబున్ విటుల్మెచ్చగన్.

శ్రీ సులక్షణ ప్రభు పరిపాలనము

సీ. రవికులక్షీరాబ్ధి రాకా సుధాంశుండు
పాలితాఖిల జగత్ప్రభు వరుండు
వందారు నరపాల బృందార కేంద్రుండు
విజితారి భూపాల భుజబలుండు
పరికంపితాజాండ పటు విక్రముండు వి
తరణ నిర్జిత బలిదానవుండు
ధవళితాశాదంతిదంతకీర్తియుతుండు
మహితసద్గుణ మణిమండనుండు
తే. రక్షకుండయి వెలయు నా రాజ్యమునకు
శిక్షితా పరాధుండు విచక్షణుండు
రక్షితాఖిల బుధుఁడు విరాజిత శుభ
లక్షణాయుతయుతుఁడు సులక్షణుండు.

ఉ. లేరవిధేయులున్ ఖలులు లేరు మలీమసవృత్త చిత్తులున్
లేరు కృతఘ్నులున్ జడులు లేరుదురాత్ములసత్యవాదులున్
లేరు పరార్థజీవనులు లేరు దరిద్రులధర్మవర్తనుల్
లేరు పరాంగనారతులు లేరు సులక్షణు రాజ్యమందునన్.

ఉ. ఆ నరపాలవర్యాళి వివిధాధ్వరముల్ హరి కర్పితంబుగాఁ
బూనికనై నొనర్చి ఘనపుణ్య విశేషత నిందిర సంపదన్
బోని మహావిభూతిఁగని, భూమఘవుండననొప్పి ప్రాజ్యుఁడై
దానపరైరి భక్తిపరతన్ జరియించుచునుండు నెప్పుడున్.

మ. కలరమ్మేటికి నూర్వురాంగ్రుడు లలితాకారల్ జగన్మోహినుల్
జలజాతాక్షులు చంచరీకచికురల్ చంద్రాననల్ కీరవా
ణులు,బింబోష్ఠులుకంబుకంఠులుసుపాణుల్ చక్రవాకస్తనుల్
తలిరుంబోడులు ముద్దరాండ్రు హరిమధ్యల్గామినీ రత్నముల్.

ఉ॥ పట్టపుదేవిరీతిఁ దనభార్యల నందఱ నేర్పుమీరఁగా
దట్టపుఁబ్రేమఁజూపి సమతన్ దనియించుచు రాగ వారిలోఁ
బుట్టదొకప్పుడున్ సవతిపోరది యెట్టిదొ ధర్మమూర్తిఁ జే
పట్టినవారలౌట ప్రభుపల్కఁగనోడుదు రాసతీమణుల్.

తే. అందఱినూర్వురు పక్కపెల్లెండ్రియల్లు
సరసమెలఁగుచు ననురాగ సరసిఁదన్ను
నోలలాడింపఁగా సుఖమొందె విభుఁడు
"నాస్తిభార్యాసమంసుఖ"మ్మనఁగ వినమె.

ఉ. ఆస్పృహఁడిట్లు సౌఖ్యపదమందుచు నుండియు నప్రమత్తుఁడై
దానపరైకఁగొల్చుచుసదా నిజమంత్రి పురోహితాది స
న్మానజనాళితోఁడ బుధమాన్యుఁడు చెల్వుగుకొల్వుదీర్చి వి
ద్యానిపుణత్వమొప్పఁగను ధర్మనిరూఢిని రాజ్యవేలుచున్

క. ఏ వేళ నీతిబాధలు
నావసుమతిఁ జెందనీక యఖిలజనంబుల్
నీవే దైవంబనఁ బతి
దేవాగారాది సత్ప్రతిష్ఠలు సలిపెన్.

క. ఇట్టుల సంతానములను
నెట్టనభువి నిల్పఁగాని నిజసతులందున్
పట్టపు దేవికి సంతతి
పుట్టువులేదయ్యెఁ బూర్వపుం గృతమెదియో ?

రాజు సంతతిలేమికి విచారించుట

మ. తరుణుల్ నూర్గురుగల్గియుండియునుసన్తానంబుశూన్యంబుగా
ధరణీవల్లభుఁడెల్లసంపదలు వ్యర్థంబంచులోనెంచి, నేఁ
జిరకాలంబిటు సంస్మృతిన్మెలఁగినన్ జిన్నారిబిడ్డండు నా
కరయన్గల్గఁడొకండ దేమి కృతమోయంచున్విలోలాత్ముఁడై.

సీ. తొలి జన్మములయందుఁ దలిదండ్రులొనరించు
వ్రతదానధర్మ తపఃఫలంబు
నిరయాబ్ధినీదుచుఁ గరముదుఃఖించెడు
పితరులదరిఁజేర్చు పెద్దనావ
స్వకులగోత్రజులెల్ల స్వర్గసౌధముఁజేరఁ
బ్రాఁకెడువజ్రసోపానపంక్తి
వంశవృక్షమ్మును వసుధనిల్పఁగఁజాలు
వెలలేనిసారంపు విత్తనంబు

తే. నాకుఁగజవియ్యేఁగా రతనాలమూట
జిలుఁగు తేనెలు జిలుకఁగఁబలుకుచిలుక
కులుకునడలొప్పు యొప్పులకుప్ప గొప్ప
పున్నెములపంట గడ్డయా చిన్నిబిడ్డ.

ఉ. ముద్దులుమూటఁగట్టుజిగిమోమునవ్వాలుకంగముంగురుల్
దిద్దుచునంక భాగమునఁదిన్నగఁజేరిచి చిన్నిబిడ్డనిన్
ముద్దులుగొంచు రాచిలుకపొల్పునఁబల్కులువల్క వించునున్
తద్దయుఁబ్రొద్దుఁబుచ్చు తలిదండ్రులపుణ్యమదెట్టిదోకదా.

చ. ధనమిడివిద్యనీయఁడుగదా? పొరపాటున రెంటినిచ్చుచో
వినయమునున్నజుట్టు నవివేచనసద్దిపొసంగఁ జేసినన్
ఘనకులమందుఁబుట్టువునుఁగల్పన జేయఁడదెట్లొ చేసినన్
తనయులలేమిఁగూర్చును విధాతవిచేష్టితమేమిచెప్పుదున్?

చ. తనయులులేనివానికిఁ గృతఘ్నునకున్ శ్రుతిహీనుఁడైన వి
ప్రునకు దరిద్రధూర్తులకుఁ బుణ్యవిహీనతఁజేసియెన్నడున్
జననతిదుర్గమంబగును స్వర్గమనంగవినంగనైన నేఁ
దనయులఁగాంచునట్టి సుకృతంబొనరింపకయుండవచ్చునే?

వ॥ అనుచు బహుప్రకారముల భార్యాసహితుండై పెద్దయుం బ్రొద్దుచింతించి, సంతాన చింతానల దందహ్యమానమానసుండునునిరపేక్షితానల్పాఖిలరాజ్యభోగవైభవుండునునై యప్పుడమిఱేఁడిప్పుడమిన్ జేయఁ దగు వ్రతదానధర్మంబు లొనర్చి కొడుకులఁగని శోకంబుడుగ నగుననియెంచి

రాజపురోహిత సంభాషణము

తే. నిజపురోహితు రావించి నేను పుత్రి
సంతతిని గాంచఁ గలిగిన సద్వ్రతములు
దాన ధర్మంబులను సవిధాన ముఁగను
చెప్పి చేయింపుఁడయ్య నాచేతననిన.

క. విని సద్విజుఁ డిట్లనియెను
జనవర పుత్రప్రదంబు సద్వ్రత ములలో
ఘన మిదియని యెట్లుగఁ జె
ప్పనగు "వ్రతానామిదం శుభం" బన వినవే.

ఉ. కావునఁ బార్థివేంద్ర వ్రతకల్ప విధానముగా వ్రతంబులన్.
నీవునుఁ జేయనౌ శుభము నిత్యము దాన మొకొక్కరీతి భూ
దేవులకిమ్ము మేలగును తీర్థములాడుము పుణ్యమబ్బు నిం
దేవిధ ధర్మమున్ సుతులనీయ సమర్థముగాక పోవునా ?

రాజు దానము లొనర్చుట

చ. అనవుడు సంతసించి వసుధామరవర్యునికా నృపాలుఁడున్
వినయముతోడ మ్రొక్కి సిరిపెంపుగ దీవనలంది దీక్షమై
కనకము ధేనువు ల్మొదలుగాగల దానముల న్క్రమంబుగా
ననుదినమీయఁగాఁదొడఁగె నర్థజనాళికిఁ బుత్రకాంక్షియై

ఉ. తానసమానభక్తి నిజదారలొకొక్కరు విప్రకోటికిన్
దానములిచ్చుచోనుదకధారలు వోయఁ గ్రమక్రమంబుగా
దాన శతంబులెన్నొ విదితంబుగఁ జేసె సువర్ణ దక్షిణల్
కానుకగా నొసంగె చిరకాలము భూవిభుఁడాత్మ జార్థియై.

సీ. సకల వ్రతంబులు శాస్త్రోక్తముగ నొ న్పె
అన్నసత్రంబుల నెన్నొ నిల్పె
అగ్రహారాది మహాదానము లొనర్చె
అతిథిపూజలుసేసె ననవరతము
ధర్మంబు గావించె ధన ధాన్యములనెల్ల
అడిగినట్లుగ నిచ్చె యాచకులకు
తల్లిదండ్రులులేని పిల్లలఁ బోషించె
ఎదురేగి దేవులకెల్ల మ్రొక్కె
పుణ్యతీర్థంబు లాడెను పుణ్య కథల
నెల్ల వినియెను భక్తి నిట్లెన్ని సేయ
నన్నిటను జేని తొల్లింటిదైన పాప
కర్మ వశమున బిడ్డలు గలుగరైరి.

వ. అంతనాభూకాంతుండు దురంతనిస్సంతాన చింతా సాగరం
బున దరిఁగానక యశ్రాంత మనోజనిత వాంఛాతరంగం
బుల మునుంగుచుఁ దేలుచునుండ నాతని సుకృతం బిక్క
రణి తరణివలెదరిఁజేర్పదోఁచెనోయన నొకచక్కనియూహా
మంతర్గతంబునఁ బొడకట్టిన

క. కని యిదియె యుక్త మయ్యెడు
మని మనమునఁ బొంగి నైమిశాటవి కిఁక నేఁ
జని ఘనులగుము ను లందఱఁ
గని దీవనలంది సుతులఁగని తరియింతుఁ.

క. అని మనమున నాతలఁ పుం
గొని రాజొకనాఁడు కొలువుకూటము నందున్
గనకమయ రత్నసింహా
సనస్థుఁడయి పల్కె నిట్లు సభ్యులు వినఁగన్.

రాజు మంత్రులతో నలోచింమట

మ. చతురంభోధి సువర్ణరత్న రచనాం చన్మేఖలారమ్య భూ
పతినై ధర్మపథైకవర్తనుఁడనై బ్రహ్మార్పితానంత సం
తత సందానిత పుణ్యకర్ముఁడనునై నారీశతంబంది యే
సతియందున్ సుతుఁగాంచనైతి గ్రహసంచారంబదెట్లుండెనో?

ఉ. ధర్మఫలంబుగాని యొక దాన ఫలంబునుగాని నిత్య స
త్కర్మ ఫలంబుగాని, విధిఁగాదని నాదగు పూర్వజన్మదు
ష్కర్మ ఫలంబుఁబోసడఁచి కల్గఁగఁజేయక పోయెనాకు స
ద్ధర్మనిబుత్త్రునిన్ జనహితంబుగ రాజ్యమునందు నిల్పఁగన్.

ఆ. కనుకనరుల కెల్ల గత జన్మదురితంబు
వెంట నంటివచ్చు విడువఁబోదు
బడుగు పేదయైనఁ బార్థివోత్తముఁడైన
ననుభవింపకుండ నరుగఁడఘము.

ఆ. ఇపుడు చేయునట్టి యీకర్మ ఫలములఁ
జనునుగుడువ మీది జన్మములను
తొల్లిచేసినట్టి దురితంబొ సుకృతంబొ
అనుభవింప నిదియె యవసరంబు.

క. ఇది యిట్లని తెలిసియు మదిఁ
గుదురుగనిలుపంగలేమిఁ గోరిక లెన్నో
హృదయమునఁ దోఁచుచుండును
గద నాయెడఁ గూడనదియె కారణ మగుటన్.

సీ. ఎల్లి పుణ్యంబులకెల్ల నిల్లగు నైమి
శారణ్య పదమున కరుగువాఁడ
అరిగి యచ్చట మౌని వరులకుఁ బ్రణమిల్లి
దీనత నాకథ తెలుపు వాఁడ
తెలిపి వారును దివ్యదృష్టి మత్కృత పాప
మునుఁగని చెప్పంగ వినెదు వాఁడ
విని వారలొసఁగ రింపుమనిన రీతినొనర్చి
కొడుకులఁ బెక్కండ్రఁ బడయు వాఁడ
పడసి చింతా సముద్రంబు గడచు వాఁడ
ననెడు కడసారి తలఁపు నా మనమునందుఁ
బొడమెఁగాన నవశ్యంబు పోయివత్తు
ననుచుఁబల్కిన సభ్యు లిట్లనిరి వేడ్క.

క. దేవరవారికిఁ దోఁచిన
దే వరమనితోఁచెమాకు దివ్యజ్ఞానుల్
గావున మౌనీంద్రులు మీ
కేవిధమున నైన సుతుల నీయ సమర్థుల్.

తే. అమ్మహాత్ముల సందర్శనమ్ముఁ జేసి
యాత్మజులఁబడయఁగ సమయమ్ముసుమ్ము
లెమ్ము జేపు ప్రయాణమ్ముగమ్ము నృప! జ
గమ్ము వల్కు "శుభస్య శీఘ్రమ్ము" టంచు.

చ. అనవుడు పార్థివుండు సచివాగ్రిణిఁ గన్గొని తెపునాకు నీ
వనుజతురంగమాబలముఁబొల్పుగసిద్ధముచేసియుంచుమీ
యనుచుబుధాళివీడ్కొలిపియప్పటికొల్వుముగించియేగెఁజ
య్యనునిజమందిరంబునకునాత్మసతుల్ వినఁబల్కువాఁడునై.

సూర్యాస్తమయము

తే. ఇనుఁడు సన్మార్గవర్తియై యించుకైన
శ్రమనెఱుంగక యంతిపురంబుజేరఁ
ఇనుఁడు సన్మార్గవర్తియై వృద్ధుఁడగుట
నలసటనుదీర్చుకొనఁ బశ్చిమాద్రిఁజేరె.

చ. పడమటికొండకొట్టకొన భాస్కరుఁడొప్పివియత్పథంబునన్
నడచిపథిశ్రమాపనయనప్రియురీతినివిశ్రమింపఁగాఁ
గడగినఁదేరికొక్కటియె కల్లగుట న్గిరినుండిజారఁగా
వడిగరథంబుతో నచటివారిధియందునఁగూలెనాతఁడున్.

ఆ. పగలుమెలఁగుహారికి భయపడి పర్వత
కాననాంతరములఁ గలఁగి డాఁగి
యుండి సమయమెఱిఁగి యుర్వోఁదొచెడుకరి
ఘటయనంగనంధకార మెసఁగె.

క. సమయకిరాతుఁడు పగగొని
తిమిరమ దేభంబు శిరము ద్రెళ్ళఁగ నేయన్
సుమనః పథమున కెగసిన
సుమహిత మౌక్తికములనఁగఁ జుక్కలుదనరెన్.

చంద్రోదయము

సీ. గాఢాంధకార మృగంబును ఖండింప
సమయపూరుషుఁడెత్తు చక్రమనఁగ
పొడుపుకొండ సమీపమున నొప్పుమిన్నేటఁ
దనరారు కోకనదంబనంగ
వినుసిరి కైసేసికొని పూర్వ దిక్కన్య
మునఁదగిలించిన ముకురమనఁగ
తూరుపు దెసనేలు దొరమేడ మొగసాల
దీపించు భటుచేతి దివ్వెయనఁగఁ
దనరెనుదయాద్రిశిఖరిపై ధాత్రి గల్గు
జారచోరుల హృదయముల్ ఝల్లుమనఁగ
సరససన్మార్గచరులెల్ల సంతసింప
నందములసీమ మరుమామ చందమామ.

తే. తాను శుభ్రాంశుఁడగుటయుఁ దారకాప
థంబు నందున మెలఁగుట ధరణి గోళ
మతనియెడఁ బ్రతిబింబితం బయ్యెననఁగ
శీతకరునందు గల కృష్ణ చిహ్న మమరె.

సీ. వెండికొండకు మేని నిండరంగును గొట్టి
మిన్నువాఁకకుఁ గ్రొత్తవన్నె పెట్టి
సద్రింపుఁబెద్దకు సింగారమొనరించి
పాల సంద్రపుడాలు పటికనార్చి
చాదంతియొడలికిఁ జాయరానలుగిడి
కప్రింపుదిప్పకుఁ గాంతిఁ బోదిగి
తెల్లుపూగమికెల్లఁ గొల్లగా మెఱుఁగిడి
మల్లెపూలకు జిగి వెల్లిఁగొలిపి
జాతిముత్తెముగముల నేత్తంబుసలిపి
తేట నెలఱాలగరగించియేటఁ గలిపి
సకలసుమనోవ్రజానంద జాహ్నవియన
నన్ని జగముల వెన్నెల యలమికొనియె.

వ. ఆసమయంబునంగాయు వెన్నెల జిగినగఁదగు తెల్లని సన్న గుడ్డలు కన్నుల కడ్డంబుగట్టుకొని వెన్నెలకుప్పలాడుకొను చిన్నపిల్లలును; పిల్లలంగనిపెంచు నేరుపుగలిగియు, నారగింపక గారాబమున నూరకమారాము సేయు చిన్నిబిడ్డలజంకల నిడుకొని వెన్నెలఱేనింజూపుచుదిన్నని మాటల బుజ్జగించుచు వెండిగిన్నెలఁ బాలుబోసినయన్నంబుఁ దినిపించుకన్నతల్లులును; కన్నతల్లిదండ్రులకన్న మిన్నయగు ప్రేమతోఁ జూచు నత్తమామల చిత్తంబుల కుల్లాసంబుగలుగునట్లఖిలోపచారంబులొనర్చి భక్తిమైఁబతిపాదంబులొత్తు పతివ్రతాంగన

లును; అంగసౌష్ఠవాదికంబుగలిగి యొకరొకరికింగల ప్రేమాతిశయంబున నొండొరులంగడువంగ వెన్నెలంగలవిరిపాన్పులంజేరి సరససల్లాపంబులాడుకొను యువదంపతులును పతులుగ్రామాంతరంబులకేగి రాకయుండుట కేమికతంబో యని గతదినంబులలెక్కించుచుఁ జక్కెరవింటివాఁడు విల్లెక్కిడి వేయువాడితూపులతాపంబునకోపక నెలరాతినెన్నెలపై మేనులంజేర్చి కన్నులుమూయంజాలక పరితపించుప్రోషిత భర్తృకలును; భర్తృనియమంబులేని వెలయాండ్రి స్నేహంబుగోరి పోవుచు నెమ్మనమ్మున స్త్రీ సుఖమ్మునకన్నమిన్నయగున దేమున్నదనినమ్మచు వెన్నెలదమ్మెవ్వారేనింగన్న జిన్నతనంబని యుత్తరీయంబులు ముసుంగులుగానిడుకొని గోడలనీడలంబడి వడివడిగఁబోవు కొడెగాండ్రును; వారిరాక వీండ్రినక విటులకై యెదురుచూచుచుఁ బూతబంగారుంగు మెఱుంగులవలె సింగారంబులుసెలంగ ముంగిటంగలవేదికలపైఁ గూరుచుండియనంగుక్రీడలంగూర్చి మాటలాడుకొను పడుపుకత్తెలును; కత్తెరకాడలవలె నెడబాయనని నాథుండు నమ్మించిమమ్ముఁ దమ్మివిల్కానిబారి కొప్పగించిచనె. నీక నెట్లోర్తుమని కడదివ్యవధిగాఁగల మన్మథావస్థలంబొదలుచు, మదనా! ! నీకదనంబునకిది యదనుగాదని కదా? పదనగు తూపులెనుగది మెదవు. ఇదియకాదె? నీమగటిమి? నీ బలం బబలలపైఁ జూపఁదగదు తగదనియు; చంద్రా!! సాంద్ర

చంద్రికాతపమ్మున నేల మమ్మేచెదవు ? కట్టా! తోఁబుట్టు వింటికిఁగంపగొట్టిన నీకెట్టుమాపై దయపుట్టుననియు;పవనా!! జగత్ప్రాణాపహంబులను నిందఁ జెందఁజాలమి నిన్నశనం బుగాఁగొనియుఁ జంపక విడుచునట్టి విషజంతువుల పాటివిశ్వా సంబు లేనట్టి నీకురూపంబెట్టు పుట్టుననియు; కుసుమశర శీత కర వాతపోతంబులంగూర్చి వేఱువేఱు నీతిఁగఱపి నిష్ఠురో క్తులాడి నిందించి యనేకవిధంబుల మెలంగు విరహిణులును గలిగియుండు నెడ, నాఱేఁడంతఃపురంబున నింతులతో జింతిత సంతానసాధనోపాయ వృత్తాంతంబంతయుం జెప్పి, సంతసం బున వారలతోఁగలసి మెలసి సుఖించి యొక్కింత నిద్రించు నంతఁ బ్రభాతంబగుటయు

### సూర్యోదయము

శా. తోఁచెన్ వేకువచుక్క తూర్పునను బ్రద్యుమ్నుండు విల్లొక్కచోన్
డాఁచెన్ వెన్నెలఱేఁడు కాంతిఁదొఱఁగెన్ దత్తాలయోగ్యంబులై
వీచెన్ గాడ్పులు కొల్లగూసెఁదమ తెల్వింబాసెఁ దారావళుల్
వీచీడోలికలందు నూగుచు సుషుప్తిం జెందె జెంగల్వలున్.

క. మునులకృపఁ దనయులం గని
తనవంశమ్ములను నిలుపఁదలఁచిన వాఁడై
తనరాక కెదురు సూచెడు
జనపతి హర్షింపఁదోఁచె జలజహితుండున్.

చ. కమలినులుల్లసిల్లె విహగమ్ములుసంతసమందెఁ జక్రవా
కములును జోడుగూడుకొనెఁ గమ్మని తేనెలుగ్రోలు చంచరీ
కములు ముదమ్మునన్దనరెఁ గర్మతతుల్ నెర వేర్పనయ్యె లో
కములకు మేలెసంగెఁ దొలిగట్టున లోకహితుండు దోపఁగన్.

తే. తాసుకులవృద్ధుగావున దరణి వత్స!
కనెదు సుతుమత్ప్రసాదను నొక్కరుని ననుచుఁ
దొలుత దీవించువిధముప్పుదోపఁ దనదు
లేఁత చేతులుసాచె భూనేతయలర.

ఉ. అంతకుమున్నె మేల్కని ధరాధిపుఁ డాత్మసతీమణీ గృహా
భ్యంతరసీమయున్విడి యహర్ముఖకృత్యము లాచరించి శు
ద్ధాంతపువాహినిం గ్రుంకి శుచిమై విహితంబగుసాంధ్యకృత్యమే
కాంతమనస్కుఁడై సలిపి కంజదళాక్షుని సంస్మరించుచున్.

తే. తనదుయత్నంబు నిర్విఘ్నమునఁ జెలంగ
యానకాలోదితంబగు నశుభమడఁగఁ
బ్రబలమౌకోర్కెతీ పెయి ఫలములిడఁగ
దానహోమాదులొనరించె ధర్మబుద్ధి.

క. అత్తఱి సచివాగ్రణి యా
యత్తంబొనరించె రథగజాశ్వపదాతుల్
బిత్తరులు సేసలిడఁ దన
పత్తనమునుండి రాజు పయనంబయ్యెన్.

క. అని శంభుఁడానతిచ్చిన
విని గౌరియుహర్షమంది పిమ్మట నే మ
య్యెనొ వినవలెనటంచును
వినయాన్వితయగుచు విభుని వేఁడుకొనుటయున్.

ఆశ్వాసాంతము

క. పరమేశ్వర కరుణామృత
భరితా నిజభక్తహృదయపంకజ మిత్రా
నిరుపమ తేజోగాత్రా
పరమాద్భుత శుభచరిత్ర పవన సుపుత్రా

చ. పరమకృపాంతరంగ పరివర్జితకామకథాప్రసంగ భా
స్కరకులవార్ధిచంద్ర పదసారసభృంగ; మదారిలోక భీ
కర మహిమోజ్జ్వలాంగ గతకల్మషసజ్జనసంగ ధీర వా
నర భటశైలశృంగ రఘునాథకథామృతజీవసంగతా

మ. సకలవిబుధతోషా నార విద్యైకభూషా
సుకవిజనమనోజ్ఞా సూర్యవాచోరసజ్ఞా
వికృతి రహితమూర్తీ విశ్రుతానల్పకీర్తీ
ప్రకటితశుభశీలా రామకార్యానుకూలా!

గద్యము॥ ఇది (శ్రీ) ప్రసన్నాంజనేయవరప్రసాదితానవద్య
హృద్య వినయవివేకవిద్యాసంపన్న ప్రతాపవంశోత్పన్న
ఆశ్వలాయనసూత్ర ఆత్రేయసగోత్రపవిత్ర ఆదెమాంబా
రామయసూరి సుకృతదంపతీజ్యేష్ఠపుత్ర అన్నపూర్ణా
కళత్ర సుజనవిధేయ హనుమయాభిధేయ విరచిత
(శ్రీ) సులక్షణోపాఖ్యానంబున
ప్రథమాశ్వాసము.



శ్రీరస్తు శుభమస్తు

శ్రీ శివాయగురవే నమః

# శ్రీ సులక్షణోపాఖ్యానము

## ద్వితీయాశ్వాసము

శ్రీ సీతాపతి భక్తవ
రాసంగరవిజితసమద రావణతనయా
భాసురసుగ్రీవ భటా
గ్రేసర కలితనయవినయ కేసరితనయా

వ. దేవా! యవధరింపుమట్లు పరమానందంబున నావలికథా
క్రమంబెఱింగింపుఁడని ప్రార్థించిన పార్వతింగని సకల భక్త
జన వశంకరుండగు శంకరుం డిట్లనియె.

రాజు నైమిశమున కేగుట

సీ. మకుటరత్న ప్రభామండలి కులకర్త
కును దోడువడుచుదిక్కుల వెలుంగ
త్వరితమ్ముగామార్గమరసిపోవుచు దండ
ధరులు ముండిటబరాబరు లొనర్ప
నగు వేడ్కనుచితవాహన సమేతంబుగా
పరివారముభయ పార్శ్వములనడువ
విజయయాత్రాక్షిప్త విక్రమవిస్ఫూర్తిఁ
గైవారములు వందిగణమొనర్ప

అనుపమజవాశ్వయుతమైన యరదమెక్కి
జనపదాదులుగడచుచు సంయమీంద్ర
దర్శనైకాభిలాషకందళిత హృదయుఁ
డై రయంబునఁగొంత దవ్వరిగి నృపుఁడు

సీ. అమ్లానసుమ పల్లవామృత ఫలశోభి
తాఖిల వృక్షలతాదియుతము
శుకముఖద్విజవర ప్రకరోక్తమధుర వా
గ్రచనాది మంజులారావయుతము
కమనీయసుమహిత కంజాతయుక్సుధా
జలపూరితాచ్ఛకాసారయుతము
స్రస్తనైజవిరోధసామజ పంచాస్య
శార్దూల హంసాది సత్వయుతము

నై పరిశస్తాత్మవైభవ హసిత నంద
నంబు విబుధపరిహార్యాత్మకంబు పుణ్య
దంబు సకలర్షిగణ నివాసంబు శ్రీక
రంబు నగుచునొప్పు నైమిశంబుఁ గనియె

చ. కనుఁగొనియబ్బిమంది బలగంబులనొక్కెడఁ జక్క నిల్పి కాఁ
చన మణిభూషణాళికవచంబులుదీసి రథంబుడిగ్గి మం
త్రిని నటనుండుమంచని మదింగలకోర్కులు వేగిరింప నా
య్యన మునిదర్శనార్థి వినయైకసుభూషితుఁడౌచుఁగాల్నడ

మ. ఫలభారానత భూజముల్ వినయభావంబొప్పఁగా మ్రొక్కు న
ట్లలరన్ వాతపతత్ప్రసూనములరణ్యశ్రీ సమర్పించు సే
సలుగాఁ గీరపికోక్తులున్ ద్విజకృతస్వస్తి ప్రదాశీర్వచః
కలనన్దెల్ప సగౌరవంబుగ మహీకాంతుండు దానేగుచున్.

ఆ. హరులు గరులు బులులు హరిణాది మృగములు
సహజ వైర ముడిగి సత్వబుద్ధి
గలసి మెలఁగుటరసి కడుసబ్బురముఁజెందె
నలఘుముని తపోమహత్త్వమునకు.

ఉ. అంతటఁగొంతదవ్వరిగిసంత నె కొందఱుబ్రహ్మచారులా
చెంత సమిత్కుశాదులను జేకొనిపోవుటఁజూచి మేదినీ
కాంతుఁడువారివెంటఁజని కాంచెమనోజ్ఞలతాది నిర్మితా
త్యంత విశాలగేహనిచయమ్మదియే మునిపల్లెయదిజా.

రాజు మునులనుదర్శించుట

వ. అతండును దత్సమీపంబునకువినయ వినమితోత్తమాంగుం
డై సని.

మ. సతతాధ్యాపిత సాంగవేదుల సదాచారైక సంపన్నులన్
గృతనానాధ్వరులన్ జితేంద్రియుల భక్తిజ్ఞానవైరాగ్యవి
శ్రుతులన్ యోగతపఃప్రభావజ సుతేజోనిర్జితాదిత్యులన్
హతపాపౌఘుల ధీరులన్ఘనియె దివ్యజ్ఞానులన్ మానులన్.

తే. కాంచి సాష్టాంగమొనరించి కరయుగంబుఁ
గట్టుకొని చెంతనిలిచిన ఘను సులక్షు
ణుని విధేయతకలరి యమ్మునులు సదయు
లై మృదూక్తుల నతనికిట్లనిరి నగజ!

ఉ. ఎందులవాఁడవయ్య ధరణీంద్రునిచిహ్నము లెన్నొ తోఁచునీ
యందున; నిర్మలంబగు నిజాన్వయ మెయ్యది నామ మెద్ది? నీ
విందులకిట్లు వచ్చుటకు హేతువ దేమొ? సవిస్తరంబుగా
విందుముగాక దెల్పుము వివేక మెలర్పననంగ నాతఁడున్.

చ. అలఘుతపఃప్రభావ విదితాఖిలలోక విశేషులార! మీ
రలు ననుబ్రశ్న చేసెడు తెఱంగది నాయెడఁగూర్మిగాని మీ
తెలియనియంశ మొండు జగతిన్ గలదే వివరింపనైన నేఁ
బలుకవినంగఁగోరి యిటువల్కుటఁ దెల్పుదునంచు నిట్లనున్

చ. తరణికులోద్భవుండ వసుధాపురవాసుఁడ నంగదేశ భూ
వరుఁడ సులక్షణాహ్వయుఁడ వారిజనాభపదారవింద బం
భరుఁడ మహాత్ములార నిజభార్యలునూర్వురువంధ్యలైరి యె
క్కరణిననున్ సపుత్త్రకునిగాఁ గృతకృత్యునిగా నొనర్తురో?

చ. అనికమునీనుఁలై సుమనసబ్జజు సృష్టికిమారుకల్పనం
బొనరుపశక్తిగల్గుసుహిమోజ్జ్వలమూర్తులు యోగదృష్టి నా
తనిగతజన్మదుష్కృతిముతత్క్షణమేపరికించిచూచి య
జ్జనవిభు సత్కృపామృత రసంబొలుకంగని పల్కిరిట్టులన్.

మునులు రాజుయొక్క పూర్వజన్మకర్మ చెప్పుట

మ. ఇనవంశాంబుధిచంద్ర పూర్వభవమందీవిల్లు రాజాధి రా
జన సౌరాష్ట్రవిభుండవై మని యఖండైశ్వర్యయుక్తుండవ
య్యనుమాఘంబున భానుఁడమ్మకరమందుండంగఁ జేసేతఁగో
మ్మని భూదేవునకీయవైతివొకకూష్మాండంబు శ్రేయోర్థివై

శా. దానం జేసియెనుమ్ము నీకిపుడు సంతానంబు లేదయ్యె; నే
దానం బేఫలమిచ్చునో యెఱిఁగి కాదా సేయుచుండె న్విందు సం
తానైశ్వర్యదమైన గుమ్మడిని దానంబీయఁగాఁ జాలియుం
దానిం స్వల్పఫలప్రదంబనుచు భూనాథా యుపేక్షింతురే.

మాఘమాన మాహాత్మ్యము

చ. ఎఱుఁగక యైన మాఘమున నెట్టి జలాశయమందు నైన నె
త్తెఱఁగున నైన భానుఁడరు దేరకమున్నె కృతావగాహుఁడై
పఱలెడు పాపసంచయముఁ బాసి చరించుననుండుటంచు నీ
వెఱిఁగి పురాణముల్వినియు నేప్పుడుఁ జేయుమి మానమయ్యెఁగా

ఉ. ఆదినిగాని మధ్యదినమందునుగాని మఱెప్పుడైనఁగా
నీ దినరాత్ర్యులార్ణవమణీ విను నీవలమాఘమందు స
మ్మోదము మీర మూడుదినముల్ని గమోక్తములై సమంత్ర తం
త్రాదులమజ్జనంబుఁగొని యాడుచుఁ జేయవదేమి పాపమో?

మ. కరమానందకరంబు శ్రీప్రదము సౌఖ్యంబాయురారోగ్యదం
బరయన్ సంతతిదాయకంబగును సర్వాఘౌఘతూలాగ్నినా
బరగున్ మాఘము దానఁ జేయఁబడుస్వల్పంబైనపుణ్యంబు భా
సుర సంతానమహీజమై ఫలమునిచ్చున్మానవాధీశ్వరా!

గీ. జపతపోహోమదాన సంచయసహస్ర
హాయమఖాఖిల పుణ్యతీర్థాభిషేక
జనితపుణ్యంబు మాఘమజ్జన ఫలంబుఁ
బోలనేరదు శతజన్మములకునైన.

తే. దురితహరమని యెంచ కెందునుఁ బ్రియ్యాద
వశకృతంబైన మాఘుప్రభావవహ్ని
గాల్చుఁబాపాటవుల; నెట్లుగాల్పకుండు
చూచి చూడక తొక్కిన చోటనగ్ని.

సీ. ధాత్రీంద్ర వినుము ద్వాదశ మాసములలోన
మాఘుంబు శ్రేష్ఠమమ్మాసమందు
బ్రతిపడాదిగను ముప్పది దినంబులుగాని
క్రమముగా మకర సంక్రమణాదినము
మొదలుగాఁగాని, సంపూర్ణమోదమనస్కు
లై ప్రభాతమున గంగాదినదులు
స్మరియించుచుఁ బ్రయాగమాధవ ప్రీతిగా
స్నానదానాదులు సలిపిభక్తి
దేవతార్చన మొనరించి దేవదేవు
స్తోత్రగీతాదివిధుల సంతుష్టిపరచి
పరగమాసమాహాత్మ్యంబుఁ బఠనఁజేసి
హరికృపఁజెంది సుఖియింతురయ్యబుధులు

సీ. పూర్తిగా నెలదినంబులు సేయలేకున్న
రథసప్తమియుఁ జతుర్దశియుఁ మఱియు
బూర్ణిమైకాదశు ల్పురుషోత్తమ ప్రీతి
కరమైన ద్వాదశీ కమలమిత్ర

వాసరంబులు శుభప్రదములు నాఁ బఱఁ
గాన నాతిథులయందైనఁ గాని
స్నానమో దానమో సత్కథా శ్రవణమో
మాధవార్చనమొ యిమ్మహిజనంబు
భక్తినొనరించి తమతమ వాంఛితంబు
లెలమినీడేర్చుకొనియెద రలఘుపుణ్యు
లంతులై మాఘమాసప్రభావ మిట్టి
దనుచువర్ణింపఁదరమానె యవనినాథ

క. తనకర్మమె తనజన్మము
తనకర్మమె తనకుసౌఖ్య ధర్మప్రదముఁ
తనకర్మమె తననాశము
తనకర్మమె తనకుమోక్షదంబు నరేంద్రా!

వ. కావున గుణత్రయానుగతంబులగు కర్మములవలన సకల చరాచరంబులు తదనుగుణంబులగు ఫలంబుల ననుభవింప బహుప్రకారంబులనీజగంబులఁబ్రవర్తిల్లుచుండు. ప్రారబ్ధప్రకారంబనుభవింపఁదగు ఫలంబుల ధాత కారణమాత్రుండై గల్పింప విధికృతంబని యతనినవివేకులు దూరుచుందురంతి యగాక యేరికైనను శుభాశుభంబు లనుభవింపఁదీఱునే నే నేల భవత్పూర్వజన్మార్జిత పుణ్యపరిపాకంబునంజేసికదా నీ విట్లు చతుస్సముద్రముద్రిత సర్వంసహా మండలేశ్వరశిరః కోటీరరత్నప్రభామండలమండిత పాదాబ్జుండవైతివి. అట్లే

భవత్కృత దుష్కృతంబున సతీశతంబుండియు సుగతిహేతు భూతంబగుసంతానంబుఁబడయ నేరకున్నావు. అయినను నీమ నంబతినిర్మలంబగుటంజేసి నీయెడలఁ బ్రసన్నుల మైతిమి. నీ యొకానొక జన్మమందలి బ్రాహ్మణపూజా సుకృతంబొండు మినుకుమినుకుమనుచు వెలుఁగుచున్నయది. ఇఁకఁగొదువ యుండఁబోదని మృదుమధురవచనంబులు సాదరంబుగఁ బలికి నిజతపోబలంబున నతనిఁగృతార్థుం జేయఁదలంచి సర సంబగు మాతులుంగఫలంబొండభి మంత్రించి ప్రాంజలియై తమ పురోభాగంబున నిలిచియున్న జేని దోయిటం బెట్టి

మునులు సంతానప్రద ఫలంబిచ్చుట

ఉ. ఓయిసులక్షణా ఫలమిదొక్కటిగైకొనిపోయి పద్మప
త్రాయతనేత్రలైనప్రియురాండ్రకు నూర్వురికున్ సమంబుగా
నీయుము వారుదీనిభుజియించినఁ దప్పకనూర్వురాత్మజుల్
ధీయుతులుద్భవింతురు త్వదీయమనోరథముల్ఫలింపఁగన్

చ. అనితనకాజ్ఞయిచ్చిన ధరాధిపుఁడెంతయు సంతసించి య
మ్మునులకు నెల్లఁగేల్మోగిచి మ్రొక్కికృతార్థుఁడనైతినంచు నె
మ్మనమునఁబొంగియాఫలముమాటికిఁగన్గవనద్దికొంచుఁదాఁ
బనివినియెన్దదాజ్ఞఁ బరివారము నిల్పినయట్టి చోటికిన్

ఉ. అంతటసైన్యసంకలితుఁడై రథమెక్కి రయంబున న్పుర
ప్రాంతము సేరఁబోవఁ దనరాక నెఱింగిసమస్త పౌరుల
త్యంతముదంబున న్గొలిచి యప్పురవీథుల వెంటరాఁగ తేఁ
డంతిపురంబుఁజేరెఁబ్రియురాండ్రటనూర్వురుసంతసింపఁగన్.

సీ. అపుడుపరివారమెల్ల రాజానుమతినిఁ
జనె గృహంబులకాతఁడచ్చటి విశేష
ములను సతులకుఁజెప్ప కమ్మొనలొసఁగిన
ఫలము శయ్యాగృహంబున భద్రిపఱచి
గీ. భోజనానంతరమ్మునఁ బువ్వుఁబోండ్ల
కెలమిఁబంచెద దీనినం చెదఁదలంచి
సమయమగుటను మాధ్యాహ్నికములుదీర్ప
జనె రయంబున మజ్జనశాలకచట
ఆ. స్నానమాచరించి సావిత్రి జపియించి
దేవ పితృఋణంబు దీర్చియతిథి
జనులతోడఁగూడి షడ్రిసోపేతమా
నన్నమారగించు నంతలోన.

రాజు చిన్నభార్యఫలము దినుట

ఉ. ఎట్టులెఱింగెనో తెలియదెవ్వరు లేరచటన్ ఫలంబునుం
గుట్టుగ బెట్టునప్పుఁగడగొట్టుది యాతనిభార్యలందుఁ దా
నెట్టులొచూచి దానిని గ్రిహించి భుజించె; నదట్లుగాద తే
గట్టులతేనిపట్టి! ప్రియకాంతలకు న్ననవిచ్చి మెచ్చినన్.
వ. అనిన నజ్జగజ్జననియగు పార్వతి లజ్జావనతవదనయైనం గని
సర్వజ్ఞుండగు పరమేశ్వరుం డిట్లనియె.

రాజు ఫలవిచార మొనర్చుట

చ. విను తదనంతరమ్ము పృథివీపతియున్భుజియించిలేచి యం
గనలను జేరఁబిల్చి వనిఁగాంచినచోద్యములెల్ల విన్చి స

న్మునివరులిచ్చినట్టి ఫలమున్దగ వారలకీఁదలంచి దాఁ
చినగదిలోని పెట్టెఁదెఱచెన్ఫలమున్నదె చూడఁ బార్వతీ.

ఉ. పండటలేమి తేఁడుపొరఁబాటున నెందునడాఁచినానొ లే
కుండు నె యిందటంచు గదినుండినపెట్టియలెల్ల బీగవో
కుండఁగఁదీసిచూచి తుదకొక్కెడ నేనది కానగామి ధీ
రుండతఁడెంత గుందెనొ మెఱుంగుము నీమది శైలకన్యకా

చ. అతనికినయ్యెడన్గలిగినట్టి విచారమపార మన్న సం
గతి సహజోక్తిసుమ్ము చిరకాలము నిష్ఠమెయిన్దపించి స
ద్గతి సుఖకారకాత్మజ శతప్రదపుణ్యఫలంబుగాంచి యీ
గతినదిరిత్తవోవగపుగల్గినదానికి మేరగల్గునే?

క. కావున ధృతిసెడి మూర్ఛిలఁ
గా వనితలు భీతిఁజెంది కడువడిఁబ్రీతిఁ
సేవలొనర్పఁగఁ గ్రమ్మఱ
భూవిభుఁడొక్కింత ధైర్యమును గొనిలేచెన్

ఉ. లేచి ఫలంబుపెట్టియను లేమికిఁగారణమేమి దానినే
డాఁచనెలేదొ తెచ్చియెచటన్బడవైచిన నేరుతీసిరో
యేచపలాక్షిద్రింగెనొకో యేమయిపోయెనొయంచులోననా
లోచన చేసిచూచి విఫలుండయి కార్యముదప్పెనంచెదన్.

ఉ. ఎవ్వరెఱుంగకుండ ఫలమిందునఁదాఁచితినంచు నెంచ నె
ట్లివ్వనజాక్షులందు నొకరేరయినన్గని తీసిరేమొ కా

కెవ్వరి కౌను రాసిటకు నిందొకపంపునె దొంగిలింతురే
యెవ్వధినైనఁగాని మది రేకుణలన్నెదరించి చూచెదన్.

మ. అనిపూఁబోఁడులవంకఁ జూచియు నెనత్యాశ్చర్యలై యెల్లపున్
విన "నంతఃపురమందుఁ జౌర్యమును గావింపంగ నీనాటికిం
గనలే వాల్పుఁడింక రాజ్యమున సౌఖ్యంబంది నిర్భీతులై
మనువా రాజను లేను నేలఁగలనా? మన్నింతునా వార్తలన్,

మ. కొడుకుల్ నూర్వురుపుట్టుసందెదరునీగొప్రాంద్రకిమ్మించుమనున్
జడదారుల్గయనిచ్చినట్టిఫలవిశాశమ్మ్యాగ్రహంబందుచున్
వడిగాఁడాఁచిభుజింపఁబోవఁగనియోసద్మాక్షి మోదీరఁదా
గడవన్నేర్చునొగాక శాసనమునిక్కంబిక్కడ న్జెప్పదే.

వ. మఱియు

శా. జాగేలానిజమున్వచింపుసరసీజాతాక్షి! నీవియ్యెడం
బాగోగుల్మదినెంచిచూడవలదే? మన్నింతునే నిన్నటం
చో గౌరీ! యొకదానినన్నటుల సేపొప్ప న్విభుండన్న న
న్నేఁగాబోలనిమెంచిరందఱదలోనాయుక్తియుక్తంబుగా!.

ఉ. ఆసమయమ్మునం దొకరియాననమింకొకరట్టై చూచుకొం
చీసడికెట్టులోర్తుమనియేలికకుం బ్రణమిల్లి "నాథ! ల
క్ష్మీసతిదివ్యపాదసరసీజములాన త్వదంఘ్రిలాన యే
దోస మెఱుంగ మేమనిరి" తొంబదితొమ్మిదిమంది రాణులున్.

వ. అప్పుడు.

ఉ. బాసయొనర్చి నేఁడుప్రియభర్తనుసమ్మతిఁగఁ జేసి పండునే
దీసిభుజింపలేదనిన దేలదెనిక్కము బిడ్డలర్గనన్
నాసరివారిలోనపుడు నాకవమానముగాదె? గాన నే
నీసమయంబున న్నిజమదిట్టిదటంచును జెప్ప మేలగున్.

చ. అనిసతులందుమిన్నయగునట్టియొయారముగల్గుబోటి యా
తనిమదినచ్చినట్టి వనితామణితల్లజమౌవధూటి క
మ్మనిపుడు దేనియల్ జిలుకు మాటలనేర్పుఁగన్నజాణ య
జ్జనపతి చిన్నిభార్యపెలుచన్దలపోసి వినిశ్చితాత్మయై.

చ. కడువినయమ్మునన్విభునికాళ్ళపయిన్బడిమ్రొక్కి, "నాథ! మీ
రడవినిదెచ్చినట్టి ఫలమాత్మజదాయకమంచెఱుంగకే
జడమతినై భుజించితిని సల్పితిమీకపచారమిట్లు తె
న్నడఁనిటువంటికృత్యములొనర్పనుదప్పుసహింపుఁడియ్యెడన్

క. అని తోడిచెలులు విన నా
తని మోఁ్రిలవచింౘె నశ్రుధారాపాతం
బును మాటికిఁ జైట చెరం
గున వారించుచును విభునకు న్మదిగరఁగన్

గీ. అపుడుసతులెల్ల భయసంభ్రమాన్వితలయి
యబలశిక్షింౘుఁగాఁబోలు నధిపుఁడకట!
యెంతసాహసురాలె యియ్యింతియనుచు
గుసగుసలువోయిరతఁడును గోపముడిగి.

ఉ. నిక్కముఁ దెల్పినట్టి తరుణీమణి దీనిని బట్టి యిప్పుడే
నక్కటికంబు మానిక్రియ మైతగు శిక్షయొనర్పనా కెయున్
మిక్కిలిగాఁ గృశించి మరణించినఁ దత్ఫలభుక్తి దీని యం
దక్కట! గల్గనున్న సుతుఁడై ననుఁదక్కుఁడుగాఁ డెచూడఁగన్

మ. అనిచింతించి వినమ్రయై వగచునయ్యబ్జాక్షి వీక్షించి త
క్కని కాంతల్మది నీర్ష్యగందురని తాఁగించిత్తు యోచింప క
త్స్యనురాగంబున నూరడించి కరుణాయత్తైకచిత్తంబునన్
జననాథోత్తముఁ డాసతీమణికి హర్షంబొప్పఁగా నిట్లనున్

క. సుదతీ! యిందునకై నీ
మదిని వగవక సుఖముండు మన్నించితి ని
మ్మది రాత్రులు తొంబది తొ
మ్మిది మందియు వలయుపనుల మెలఁగుచునుండన్.

రాజుభార్యలు మత్సరించుట

మ. అనియయ్యంగనకిష్టమౌపనులు సేయన్నూర్గురిఁబోషింపఁగా
వనితానీకము నాజ్ఞ చేసియతఁడున్బ్రేల్మాల కేపొద్దు దా
నిని బ్రేమంబునఁజూచుచున్న యెడనన్ని రేజపత్రేక్షణల్
జననాథుం డెడమైన వేళలనుమాత్సర్యాన్వితస్వాంతలై.

సీ. ఉరుభక్తితన మేర నుండికొల్చుటెకాని
యింపుగా వనివిహారింపఁబోము
విపులసపర్యల వేడ్కసేయుటెకాని
పరుషోక్తిమదిఁ గలుపంగఁబోము

సానురాగోక్తికి సంతసించుటె కాని
కొసరి యేవస్తువుఁ గోరఁబోము
చెలిమిని మనమెల్లఁ జేరియుండుటె కాని
యెంచును భేదంబుఁ జెందఁబోము

తవిలి ప్రాణాంతమైన సత్యంబె కాని
బాసలోనరించి యనృతము ల్వాలుకఁబోము
తన్ను దైవంబుగా నెంచు తరుణులందు
నిటుల వేమైన పతిబుద్ధి నెఱుఁగఁబోము.

సీ. కలికిపై మోహమగ్గలముగాఁ దనకున్న
నింపుగాఁగూడి సుఖింపరాదె
కోమలిపైఁ దనకూరిమి మెండైన
గోర్కెల్లను సమకూర్పరాదె
అబలపైఁ దనకింత యనురాగ మమరినఁ
గలకాలమును జెంత మెలఁగరాదె
సతిపైని వనమతి సంలగ్నమైయున్న
మనబోంట్ల నవల బొమ్మనఁగరాదె
అకట! సుతశతప్రదఫలంబపహరించి
యార్ష్యసంతయుఁ దాభుజియించినట్టి
గడుసు రాలున కిటులూడిగములు సేయుఁ
డనెను విభునాజ్ఞ మనయభాగ్యంబుగాదె.

మ. చెలిమి న్మూర్ద్వేర నొక్కతల్లి గని పెంచెన్నానుఁగ సొంపొప్పనే
కలతల్లేక ప్రియుండు మెచ్చ నకలంక స్వాంతముల్గల్గి బి
డ్డలకై యందజ మొక్కరీతి వగనుంచన్జూచి తానొక్కతే
ఫలమున్దీసి భుజించె మత్సరమున న్భావింప వేఱున్నదే

క. కలనిజము నెఱుఁగ విభునకుఁ
గలశక్తియు యుక్తియెఱుక గలిగియుగువ దా
నలఘు ఫలమలఁతిగాఁ గొని
తెలియక నేఁదింటిననుట తెలివియె తెలియన్.

చ. ఫలముసుతప్రదంబనెడు వాస్తవమద్ది యెఱుంగదేని నెం
దులకు రహస్యవృత్తిని దినున్మనకేరికిఁ జెప్పకుండఁ దాఁ
దెలియకపోవు నెట్లు? కనదే యిఁకబిడ్డల? గొడ్డురాండ్రమై
యిలఁగలకాలమిట్లు వసియింపఁగ నేర్తుమె? దానికోర్తుమే

ఉ. అప్పుడె నాథుఁ డాఫలము నందజకీయక డాఁచ నేలఁ దా
నిప్పునిఁ దప్పుగాఁదలఁపకింతి గ్రహించి భుజింప నేల తేఁ
డొప్పుగ శిక్ష సేయకయె యూరడిలం బలుకంగ నేలనో?
యిప్పటికైన నుందెలియదే విభుచిత్తము దానివృత్తమున్.

మ. అనియీరీతి బహుప్రకారముల నయ్యబ్జాక్షులూహించిలో
ననుమానంబును వాఙ్మనఃక్రియల వేఱై యున్న చందంబునా
థున కొక్కింతయెఱుంగ రానిగతి నెంతో నేర్పునన్దానెఁ బూ
సిన ఖడ్గంబులయట్టులుండిరి మృగాక్షీ! సేయుకార్యంబులన్

రాజ కనిష్ఠపత్ని గర్భవతియగుట

వ. అంతఁగొన్ని దినంబులకు

క. అలఘుతపః ఫలమనఁదగు
ఫలమునుభుజియించినట్టి భార్య బుతుదినం
బుల విభుమనమలరఁగఁ దాఁ
గలసినదై దైవకృపను గర్భముదాల్చెన్

చ. నెలమసలెన్ గృశోదరికి నెన్నడు మొప్పగఁగానుపించె వాం
తులుతఱుచయ్యెఁజన్నొనలునున్నలుపెక్కెరుచించెమన్నువాం
ఛలుబహుళంబుగాఁదనరె సన్ముఖపద్మముతీరుమారెఁ బొ
క్కిలియునునారుమీఱెఁబరికింపఁగమందమునయ్యెయానమున్

వ. అప్పుడు.

క. చూలాలును నవమాసము
లాలోలాక్షులు మనంబులందలి పగచే
నేలీల నెదియొనర్చిన
మేలదియనితలఁచు నెఱుఁగమిం బగ దనలోన్.

వ. కావున.

క. ఇతరుల కలిమికి విద్యా
ధృతికిఁ జసితకీర్తి కతుల తేజమునకు సం
తతికోర్వని జనము లధో
గతి నొందుదురగజ ! సుఖముఁగనబోరెందున్.

ఆ. కలికి నెన్నొగతుల గష్టముల్గన జేయఁ
జేయఁగలుగుపనులు సేసినార
మతివరొక్కనాటి కలయదు సొలయదు
చిత్రమయ్యెనిపుడు చేడియకును.

ఆ. నెలలుతొమ్మిదిసనె నీళ్లాడుప్రొద్దయ్యె
మగువసుతునిఁగనును మాపొశేపొ
విభుఁడుగొడ్డురాండ్రి విడనాడకుండునా?
యేమిసేయువార మింతులార!

కనిష్ఠభార్య కష్టములు

క. ఎంచనెచెలి ఫలమును భుజి
యించెడు నెడ మదిని మనలనించుకయునుఁ గో
పించెనె? పతిదానికి మే
లెంచి చరింపంగనేల యిప్పుడు మనముఁ.

సీ. జననిందకోర్చి భూమినిజరింతుముగాక
తోడిది సుతుఁగన్న జూడఁగలమె?
వంశక్షయంబునఁ బాపమబ్బునుగాక
చెలిపుత్త్రిఁగన సంతసింపఁగలమె?
జననాథుఁడెఱిఁగిచంపినఁ జచ్చెదముగాక
సవతిబిడ్డనుగన సైపఁగలమె?
శిశుహత్యకై కాలుచే సుశ్రుకుడుముగాక
యువిదకుట్టునిఁగన్న నోర్వఁగలమె?

అనుచు సవతులుగర్భనాశార్థమౌష
ధంబునొసఁగిరి తిను పదార్థంబులందుఁ
గలిపి తెలియకభుజియించెఁ జెలియు మత్సః
రంబు గలిగిన నోఁడి యురగంబుగాదె?

వ. అంతట

తే. గర్భమున నర్భకుండబ్జగర్భసదృశ
మునితపోబలమున ముప్పుగనక మనిమె
ననుపమ విషప్రయుక్తమౌ నౌషధంబు
వలన నింతికిఁజిత్త విభ్రమముగలిగె.

సీ. పొరిఁబొరి బెళుకు చూపులఁజూచు చపలాక్షి
యూరకదిశల గుప్లుటఁమిచూచు
జిలుగుతేనియలొల్కుఁ బలికెడు కలకంఠి
తబ్బిబ్బుగాఁబెద్ద బొబ్బలిడును
అడుగులో నడుగుబెట్టెడు మత్తకరియాన
పనిలేక యిటునటుపరువులెత్తు
పిలిచిననేగాని పలుకని మితవాణి
గొనకొనిమాటికి గొణుగుచుండు
ఇదియదియనంగనేల నయ్యింతిచేష్టి
తములు గుణము లతివిపరీతమ్ము లయ్యె
సహజమేగద జగతినిఁ జపలచిత్తు
లైన జనమిట్లుసేయుట యదితనయ!

తే. అంతనొకనాటి నడిరేయి యందునెట్లొ
రాజసౌధంబువిడి మహారణ్య సీమఁ
జొచ్చెఁ బిచ్చిదియైనిండు చూలు నెలఁత
గతవివేకునకిల్లేది గహనమేది ?

సుధర్ముని జననము

ఉ. పొందికలేని వేడ్కమతిపోయిన యాలలితాంగి కానలో
నం దిరుగాడుచుండి యొకనాఁడొకపూఁ బొదరింటిచెంత మ
ధ్యందిన భాను తేజు విమలాకృతినిర్జిత సుప్రసిద్ధ గో
విందజునిద్దనూజుఁ బ్రసవించెశుభా కరలగ్నమందునన్

ఆ. కన్న సుతునిమోముఁ గన్న వెన్నెల లేని
కన్నమిన్నవన్నె నున్నఁ గన్న
యన్న చన్నుఁగుడుప దెన్నజ్ఞానమ్మలే
కున్న ప్రేమ మన్న సున్న గాదె ?

ఉ. కావునఁగాపుకాపునిగట్టిగనేడ్చెడు చిన్నికూన నం
దేవిడనాడి దవ్వుల వనిన్జరియించుచునుండదాని పా
పావళిరూపమోయనఁగ వ్యాఘ్రమొకణ్డొక మూలనుండిమై
తావినిఁబట్టి వచ్చినదితన్నినెఁ బార్వతి ! విన్ముపైకథన్

క. ఆపసిపాపనియేడుపు
దాపునగల కొలని పసిడితమ్ములు దినుచున్
బ్రాపుగవిహరించెడు భూ
పాపతి వాహనమొకండు చయ్యన వినియెఁ

చ. వినితసతోడియంచగమి వెంబడిరాఁబోదరింటిచెంతకున్
జనికడుఁజాలివుట్టఁ బెలుచన్ విలపించెడు చిన్నిబిడ్డ రా
తనయునవోజ్జ్వలాంగుఁగని తద్వనదివ్యఫలామృతద్రవం
బును గుడిపించియేడ్పుడిపిపోషణసేయఁగసాఁగెనిత్యమున్

సీ. నిజగరుచ్ఛాయల నిదురవోనొనరించు
సూర్యాతపమొకింత సోకనీక
స్వనఖముఖానీత ఫలసుధారసముల
దృప్తిఁగావించు క్షుత్తృష్ణలడఁగ
తనదుమంజులకూజితమ్ముల నూరార్చుఁ
జనవొప్పఁజేయు రోదనము నుడుగ
నాత్మజాతిఖగాళి ననిశమ్ముగాపుంచు
గ్రూరసత్వములటు సేరకుండ
పతగకులభూషణంబు వాక్పతిరథంబు
స్వర్ణదీస్వర్ణవిమలాబ్జ భక్షకంబు
రాజహంసంబు తామహారణ్యసీమ
శిశువునవ్యాజకరుణఁ బోషించుచుండె

రాజు విచారపడుట

చ. అటనిజపత్నిగర్భవతి యామినివేళను జిత్తవిభ్రమో
త్కటయయియేగెనెచ్చటికొ కావలివారలకన్నుఁబ్రామిషం
చటు పరిచారకుల్దెలుప నానృపుఁడెంతయుఁజింతనొంది య
క్కట! యిటులయ్యెనేతుదకుఁగాపురమంచువిషాదచిత్తుఁడై

శా. ఏదారింబడిపోయెనో నడువలే కేజాడలన్నిల్చెనో
యే దేనొక్కతప్పుగంబువాతఁబడెనో యెచ్చోటనెట్లుండెనో
యేదిక్కుఁ గనిపెంపఁగాంచ గలనో యేణాక్షి నే నెవ్వడన్
నాదుష్కర్మఫలంబు చేతఁగననో నాభాగ్యమెట్లున్నదో?

మ. అనిచింతించియుఁగొంతనట్టునకు ధైర్యంబంది భూభర్త త
ద్వనితాన్వేషణతత్పరుండయి చతుర్వారాశివేలాయితా
వని విభ్రాజితకాననాద్రినగర వారిత్రాద్యనేక స్థలా
ళిని సైన్యాన్వితుఁడై చరించియును నాళీకాక్షిగన్పట్టమిన్

వ. పలు తెఱంగుల విలపించి ప్రయోజనంబుగనక

శా. సంతానప్రదపుణ్యహీనుఁడవు రాజా యంచు మౌనీంద్రుల
త్యంతానుగ్రహబుద్ధినిచ్చిన ఫలంబబ్జాక్షి భక్షించినన్
సంతానంబులభించునే మృషలె భాషానాథువ్రాఁతల్ వృథా
చింతల్ యత్నఫలంబులౌననుచు వచ్చెన్వేగ తాఁడింటికిన్

ఆ. అతనికపురుషుకుదిరె నధికమై రాగ్యంబు
సతులు సుతులు గలుగ నెతలటంచు
దేవి! నిజమెగా? "అభావే విరక్తినా"
ననుభవజ్ఞవచన మరయనెంచు

చ. అనవినిగౌరి భక్తివినయంబులుదోపఁ గృతప్రణామయై
చనవునస్వామి! మీమధురసారవచస్సుధ నెంతద్రావినన్
దనివిజనింపదయ్యెను మనంబున హంసము లెంతకాల మ
వ్వనిఁబెనిచెన్నదంపడి నృపాలసుతుండెట కేగెఁ దెల్పుఁడీ

## ఆశ్వాసాంతము

వ. అని వేడుటయు

శా. భవ్యాబ్జవ్యాజకృపాపూర్ణనయనా! భక్తార్తికృద్భీషణా
ధివ్యాధిప్రముఖాద్యుపాధినిచయాది ప్రహ్రదినీధారణా!
దీవ్యద్వ్యాలశిఖాగ్ని దగ్ధవిపులాదిత్యద్విషత్పట్టణా!
క్రవ్యాదాధిపసైన్యకాననకుఠారా! రామభక్తాగ్రణీ!!

క. భూతప్రేత పిశాచ
వ్రాతోరగవిహగరాజ! వరభక్తమనో
బ్జాతద్యుమణీ! హితకృ
త్సీతా రామాంఘ్రికమల సేవానందా!!

సన. వానరనరప్రభుసభాసదసుధీంద్రా!
దానవవినాశనవిధానవిజితేంద్రా!
శ్రీనిలయసద్వినయసేవితమునీంద్రా!
భూనిభశమాదిగుణభూషణకపీంద్రా!!

ఇది శ్రీప్రసన్నాంజనేయ వరప్రసాదితానవద్యహృద్య
వినయవివేక విద్యాసంపన్న ప్రతాపవంశోత్పన్న
ఆశ్వలాయనసూత్ర ఆత్రేయస గోత్రపవిత్ర
ఆదెమాంబా రామయసూరి సుకృత దంపతీ
జ్యేష్ఠపుత్త్రి అన్నపూర్ణాకళత్రి సుజన
విధేయ హనుమయాభిధేయ విరచిత
శ్రీసులక్షణోపాఖ్యానమున
ద్వితీయాశ్వాసము

శ్రీరస్తు    శుభమస్తు

శ్రీ శివాయగురవేనమః

# శ్రీ సులక్షణోపాఖ్యానము

## తృతీయాశ్వాసము

శ్రీ శంకరాంశ సంభూ
తా! శంకారహితహృదయ! దానవలంకా
నాశంకర! నిఖిలార్తి హ
రా! శంకర! ఆంజనేయ! రామవిధేయా!!

తే. అట్లు హైమవతీ సతి యానృపాల
తనయువృత్తాంతమును సవిస్తరముగాఁగఁ
దెల్పుఁడని వేడఁ గ్రొన్నెలదాల్పు కరుణఁ
జెప్పినవిధంబు వినుపింతు జిత్తగింపు.

మునికి రాజసుతుఁడు లభించుట

ఉ. అండజయానరో వినుము హంసము రాసుతునొక్కవత్సరం
బెండకువానకున్జలికి నించుకయైనఁదపింపనీక నా
దండమెలంగుచున్బలు విధంబులఁబోషణసేయుచుండ బా
లుండొగినిల్చితప్పడుగులుం దడబాటుగవేయనేర్చినన్.

క. నడిచెడు బుడుతఁడువిచ్చల
విడిఁదిరిగినఁజెడుగు సంభవించెడునడవిన్
గడుమేలుసుమ్ము చేర్పఁగఁ
దడయక జనులుండునట్టితావునకితనిన్.

ఉ. అంచురయంబునన్ శిశువునాత్మగరుద్బలయుక్తి వీపునన్
గొంచు దోకమానివాసమునకున్నడు దాపునవొప్పునిర్మలా
భ్యంచిత వారి జాకరతటాంచలభూమినిడించి వీనిఁబో
షించెడుఁగాంచియిచ్చటి ఋషిపత్రికరంబనియెంచియేగినన్.

ఉ. తద్వనజాకరమ్మునకు దైవవశంబునఁ దానమాడ భా
ర్యాద్వితయుండుసంయమివరాగ్రణియొక్కఁడు సేరవచ్చి రా
కాద్విజరాజతుల్యముఖకాంతి సముజ్జ్వల దివ్యరూప రే
ఖాద్వయు వత్సరద్వయవయస్కునృపాలతనూజునయ్యెడన్

క. కని యెట్టిపుణ్యులీ చ
క్కని శిశువునుగనిరో ? పెంపఁగా నెవ్వరు ది
క్కని విడిచిచనిరో ? యేరిలఁ
గని కరములనెత్తరితనిఁ గనికరముమెయిన్.

ఉ. వీడిన పేర్మిఁదన్ను నడవిన్గని పెంచినవాఁడించి యే
జాడలఁబోయిరోయని దెసల్పరికింపఁడు దైన్యచిత్తుఁడున్
గాఁడు సుఖంబుగానగుమొగంబలరారఁగనాడు నీతనిన్
జూడఁగఁజిత్రమయ్యెననుచున్మని బాలునిడాసిప్రీతిమై.

తే. శిరముపొంకమ్మునెమ్మోము చెలువు నేత్ర
కోణరక్తిమ గళరేఖ గురుభుజోన్న
తియును బాహులదైర్ఘ్యమ్ము త్రివళికల్మిఁ
బద్మరేఖాది విలసిత పదము లరసి.

ఉ. వీఁడిలసార్వభౌమపదవిన్గనఁజాలు సులక్షణంబులన్
గూడినకోమలాంగములకున్గుదురయ్యెడునార! వీనికిన్
దోడగుదైవమెయ్యెడలఁ దొల్లిటిపుణ్యమెయెట్టివారికిన్
దోడయిప్రోచుశత్రువనతోయధి వహ్నులమధ్యనైననున్

ఉ. దైవసురక్షితంబయినదానికిఁ గల్గదునాశమెప్పుడే
తావుననెట్టులున్నను యథార్థముగా సశియించునెప్పుడా
దైవకటాక్షవీక్షణము దప్పనొయప్పుడె యెద్దియైననే
తావుననెంతభద్రముగఁదార్కొనియెంతటివారుదాఁచినన్

చ. అనుచు బహుప్రకారములనమ్మునిపుంగవుఁడాత్మనెంచి బా
లునిఁగొని ముద్దులాడుచుఁ దలోదరులిర్వురు వెంటరాఁగ వ
చ్చినపనిఁజక్కఁబెట్టుకొనిచేరెఁగుటీరము నంతనింతులన్
గనికడుఁజాలిఁగొల్పునుడిఁ గమ్మని తేనియఁలొల్క నిట్లనున్

మ. జలజాతాంబకలార! తీఱెమనకున్నంతానలోపంబు చిం
తిలగా నేటికి నేఁటికీ శిశువుఁబ్రీతిన్దైవమిచ్చెన్గదా?
ఇలలోనౌరసదత్త పుత్రికులలో నేరైననున్పైతృకం
బులఁజేయంబితృతృప్తియౌటనిగమంబుల్పల్కునిక్కంబుగన్.

ఉ. కావునమీరలీశిశువుఁగంటికిఱెప్పవలెన్గనుంచు స
ద్భావముతోడ మీకునుశుభంబగు నిట్టియనాథులన్దయన్
బ్రోవదయామయుండుహరిముందగుజన్మములందుమిమ్ములన్
గావఁడెలబ్ధపుత్రిలనుగా నొనరించియటన్న వారలున్

క. అలయక విసువక దమలోఁ
గలహింపక పెంచిరతనిఁగనిన జననులుం
బలె రెండేండ్లు విను హిమా
చలతనయా! యంతనొక్క సమయమునందున్

మునిపత్నుల కలహము

చ. మునియును యోగనిష్ఠఁదపమున్బొనరించెడు వేళఁదత్ప్రియాం
గనలును బాలుని న్గరయుగమ్మొకసారిగఁ సాఁచి రమ్మర
మ్మని కడుఁగూర్మిఁబిల్వఁదరియన్జనకుండిన రావదేమిరా?
యని చెరియొక్క చేయిఁగొని యట్టిటులాగుచువారలిద్దరున్

చ. విడువుము బాలునిన్? విడిచిపెట్టఁగ నెట్లగుఁబట్టి నేను? నీ
కడుపునఁబుట్టెనే యితఁడు? కంటిని నీవలె మాట నేర్చు చా
లుడుగుముగట్టివాయితనమొప్పెడు నౌనిఁకఁగట్టిపెట్టు నీ
దుడుకుఁదనంపుఁజేష్టలనుదూరముగాననుచున్ జలంబునన్

గీ. బాలునేఁగంటినని పెద్దభార్యనుడువ
నాతి! నేఁగంటిననుచుఁ జిన్నదివచించుఁ
బట్టిఁ బెనిచితినని జ్యేష్ఠపత్నివలుకఁ
గాదు పెంచితినేనని కడది యనును

గీ. ఇటులఁ బ్రియలిర్వురును గలహించుటెఱుఁగఁ
డయ్యెమునిచంద్రుఁడును జెప్పరైరిసతులు
బాలుఁ డవ్యక్తుఁడగుటను బలుకఁడయ్యెఁ
గర్మసాక్షియు నపరాద్రి కడనుగ్రుంకె

సంధ్యాకాల ప్రకృతి

సీ. లోకబంధువు పరలోక మేగిన నేడ్పు
జగదబలాంబక చ్ఛవియనంగ
బ్రియుడు వెల్గుల తేడు విడనాడ వగ చెడు
పద్మినీ తతివిలాపంబనంగ
గర్మసాక్షి నశింపగా సర్వజనులను
బై కొనునజ్ఞాన పటలమనగ
నినుడ స్తమించిన నేమేమనుచు నేల
గడ గెడు స్వల్పాధికారు లనగ
సాంధ్యరాగంబు విహగసంచయరవంబు
నంధకారంబు చుక్కల యతిశయంబు
దోచె గ్రిమముగ బగటియందున నొనర్ప
రాని పనులను జేయగ రాత్రియనగ

రాచబుడుత(డడవిని విడువ(బడుట

వ. అంతట

ఆ. ఏటికితని(బెంప నేమేల గలపింప
వాన లేనివఱద వచ్చెనన్న
భంగితో(చెనిపుడు బాలుని(గాంచుట
బెంచు టేమును గలపించుటనుచు.

క. మునికాంతలందు( బెద్దది
మనమున(గనినట్టి సవతిమచ్చరమున బా
లుని(గొని దవ్వుల(గల యొక
వని డించి యెఱుంగనట్లు వచ్చెన్మగుడన్.

ఉ. అంతదినాంతమందుముని యర్భకుఁ డెచ్చటి కేగెనన్న న
య్యంతు లెఱుంగ మేమనిరి యేమిగతంబనియాత్మ సర్వ వృ
త్తాంత మెఱింగి శాపశిఖదగ్ధులుగా నొనరింపఁడయ్యె నొఁ
గాంతరొ మోహమున్న ప్రియ కాంతలఁజింతల పాలొనర్తురే

వ. అనవిని పార్వతియు

గీ. ఆలుపోట్లాడుకొని లేగ కాలుద్రొక్క
న నెడుమాటకు దార్కాణమైన రాచ
బిడ్డఁడడవిని గొడ్రాలు విడిచిచనిన
నా మెకై యెంతవిలపించెనో మహాత్మ.

శంకరుండు పార్వతికిశ్రీవిష్ణుతులసీమహిమ చెప్పుట

చ. అనవిని శంభుఁడిట్లను దయామయుఁడాహరి సర్వభూతపా
లనవిధినప్రమత్తుఁడబలా యటుగావునఁ బ్రాణికోటిము
వ్వనుఁగనదొక్కనాఁటికిని బూర్వభయార్జితపుణ్యపాపవ
ర్జన మొనరింప రామినిల సౌఖ్యముఁగష్టమునొందుచుండెడిన్

వ. కావునన బ్బాలుండును బ్రారబ్ధవశంబుననిర్జనంబగు వనం
బునవిడువంబడి కొంతవడివిడిచిచనినయప్పుడతుకంబొడగన
నడవింబడి పొదల వెంబడి యడుగులుదడఁబడ నడువలేక
నల్లాడుచుఁజీఁకటింబడి వెదకుచు దైవయోగంబున సుందర
మందిరోపమానంబగు తులసీగుల్మంబొక్కండు గాంచి
డాసియానిశియం దెవసించి మఱునాటియుదయంబున

సీ. రాత్రియంతయును నిద్రయునన్నములు లేమిఁ
గడుడస్సియున్నట్టి కారణమున

క్షుద్బాధితుండయి శోకింపనారోద
నమువినిన ఖగమృగములగములు
చనుదెంచి సామీప్యమున నొప్పెడురసాల
ముఖభూజఫల రసములను దెచ్చి
క్షుత్తృష్ణలుడిపి మంజులరవంబులనూర
డించెను గడుజాలిగాంచియతని
నతఁడుచింతమాని యలవాటుపడియుండె
నధికమైతి ఖగ మృగాళితోడ
నఖిలపాపహారియగు తులసీస్పర్శ
దర్శనము పవిత్రితను ఘటింప.

మ. కలిగెన్వానికిసర్వభూతమయుఁడౌ కంజాక్షుపై బుద్ధి ని
శ్చలమైనిల్చెఁదదీయనామ భజనాసక్తిన్మనంబెన్నఁగాఁ
దులసీస్పర్శన దర్శనార్చనములన్దోషాళిఁదూలించి ని
ర్మలమైనట్టి మనంబుతోడహరిఁజేరన్వచ్చుఁబో నెవ్వఁడేఁ.

క. తులసీదళ గంధమ్ములు
తులసీదళయుత పవిత్రితోయమ్ములుశ్రీ
తులసీదళ మాలికలును
తులసీపూజనము లఖిల దోషాపహముల్.

చ. తులసినిసంస్మరించినను దోయముపోసినమస్కరించినన్
దులసినిబూజచేసినను దోటలుగానొనరించిపెంచినన్
దులసిదళంబులన్ హరినిదోరభక్తిని బూజచేసినన్
దులసియనుగ్రహంబునజనుల్ హరిఁజేరుదురింతిభక్తులై.

వ. కనుక నాలుగేనులయీడుగలయబ్బాలుండుచదువుసందెలు లేనివాఁడయ్యు శ్రీ హరి ప్రియయగు తులసీ సందర్శన స్పర్శనాదిక్రియాజనిత భక్తివిశేషంబున

భగవద్భక్తి లక్షణము

మ. హరి!నారాయణ!వాసుదేవనృహరీ!యజ్ఞేశ! దామోదరా!
మురవైరీ!మధుసూధనా!వరకృపాంభోరాశి!సంకర్షణా!
వరదా!మాధవ !దేవకీతనయ! శ్రీవత్సాంక! యంచున్వనిన్
జరియింపందొడగెన్ నృపాత్మజుఁడుతత్సంకీర్తనానందుఁడై

ఉ. తల్లియుఁదండ్రియున్గురుఁడుదైవముభ్రాత సఖుండుబంధువున్
సల్లలితాబ్జపాణిహరి సర్వమయుండిటనాకు నన్యునే
నొల్లభజింపనంచుదనయుల్లము రంజిలనాడు; భక్తిసం
పల్లలితుండతండునొకప్రాకృతబాలుఁడెయెంచిచూడఁగన్.

ఉ. ఆదిమునీంద్రులైన సనకాదులు పర్వతనారదాదులున్
భూదివిజర్షివ్యాసమునిపుంగవుఁడుం శుకుఁడున్ ధ్రువుండు ప్ర
హ్లాద విభీషణానిలసుతాదులు వానికిసాటివత్తురా
శ్రీదయితుం స్మరించునెడఁ జిత్తమునిల్పెడుపట్ల నద్రిజా.

సీ. భవబంధవల్లికా నివహాలవిత్రంబు
భయనీరదచయ ప్రభంజనంబు
సంసారజలధి శోషణబడబానలం
బఖిలార్తిరుగ్జీవనౌషధంబు
ఘోరపాతకశైల కులిశంబుకామాది
శాత్రవ పవన భుజంగమంబు

తాపత్రయాదికాంతార దవానలం
బజ్ఞానతిమిరోదయార్కబింబ
మైన శ్రీహరి దివ్యనామాను కీర్త
నంబు శ్రవణంబు నుచ్చారణంబు బోధ
నంబు మొదలైన భక్తియోగంబులరయ
నంబుజాక్షునిఁగను సాధనంబు లగజ

చ. అలయక వేదశాస్త్రనిచయార్థములెల్లఁబఠింపవచ్చుఁ గా
నలనయుతాబ్దముల్ నిరశనవ్రతనిష్ఠఁదపింపవచ్చు నిం
పలరఁగనర్థికోటిదనియన్ సకలమ్మిడవచ్చుఁగాని ని
శ్చలమతిభక్తినచ్యుతునజస్రముగొల్చుటదుష్కరంబగున్

వ. అట్లగుటంజేసి పార్వతీ ! విషయాసక్తిఁదగులువడిన యింద్రి
యంబులకులోనైనమనంబునశ్రీహరిన్ స్మరింప నేరకదుర్లభం
బగుమనుష్యజన్మంబువ్యర్థంబు జేయంబడు. కావునబుద్ధిమం
తుండగు నరుండవ్యక్తవిషయుండై కౌమారసమయంబునఁ
బరమాత్ముండగు శ్రీమన్నారాయణుని శ్రవణమననాదులఁ
గనంబ్రయత్నింప మనంబుగల్గినయింద్రియంబులు లోఁబడఁ
గార్యంబుసాధించిసార్థకజన్ముండగునని మఱియు నిట్లనియె.

సీ. ప్రారబ్ధమనుభవింపఁగ జీవుఁడును దేహి
యైపుట్టుచుండు నియ్యవనియందు
నందుమానవజన్మ మందఁగల్గిన సుకృ
తాత్ములందును గొందఱజ్ఞులగుచు

బాల్యమందున నాటపాటలఁ బ్రాయమం
దంగనాసక్తి ధనార్జనాది
విషయభోగాదుల వృద్ధత నసమర్థ
తను నాయువెల్ల గతంబుగాఁగఁ
జెసుదు రురుపుణ్య కర్మము చేసికొంద
ఱమలులై స్వర్గ లోకాదులందునుందు
రతులభక్తిని నా బాల్యమందుఁ బాత్ముఁ
గొలిచి చేరుదు రతనినిఁ గొంద ఱబల!!

క. పంచమహా పాతకులును
నెంచక పాపములు విడుతురేని హరి హరీ
యంచు నతనిఁజేరుదురు; ను
తించి సదాభక్తులతనిఁ జేనిసలతురో?

శా. ఏనేమంబులు లేక నెట్టిపలితుండేనిఁ బ్రమాదంబుచే
నైననో మహాభయార్తినైన నొకపర్యాయంబునో రారఁగా
వీనుల్విందుగనన్న విన్నఁదుదకవిష్ణున్విభున్జేర్చు నా
శ్రీనారాయణదివ్యనామ మహిమన్జెప్పన్ సమర్థుండనా?

రాజసుతుని చర్య

ఉ. ఇంతకుఁబూర్వపుణ్య మొకయించుక లేకజనింపఁబోవదా
వంతయుదైవభక్తి వనినర్భకుఁడా కమలాక్షుపై నిజ
స్వాంతమునట్లునిల్పుటకుబాపురె! పూర్వపుజన్మమందుఁడా
నెంతటిపుణ్యకార్యముల నెన్నియొనర్చెనో? నిష్ఠతోడుతన్

సీ. జలజాక్షునామసంస్మరణ పరత్వంబు
నను వేగ నిద్ర మేల్కొనుచు లేచి
పరిసరాబ్ధాకర ప్రాంతంబునందుచి
తంబులౌ కాలకృత్యములు దీర్చి
నిజకరాంజలిసమానీత నిర్మలతోయ
ములభక్తిఁ దులసిని జలకమార్చి
నవపత్రపుష్ప పల్లవఫలాదుల షోడ
శోపచారంబుల నొగి నొనర్చి
అచ్యుత! యనంత! గోవింద! హరి! ముకుంద!
యనుచు శ్రీపతి దివ్యనామామృతరస
పాయియై యాఱుమాసముల్వరమ భాగ
వత శిఖామణి గడపె నవ్వనమునందు.

వ. మఱియు

తే. తులసిఁబూజించి యొకనాఁడతో యజాక్షుఁ
దమ్మికనుఁగవమూసి లోఁదలఁచునంత
విమలహృత్పద్మపీఠస్థు విధిముఖామ
రార్చితపదాబ్జు శ్రీవిష్ణునతఁడుగనియె.

ఉ. కాంచితదీయదివ్యతను కాంతివిలాసము వైజయంతి కా
ద్యంచితహారశోభితభుజాంతరసీమఁదటిల్లతా పరిభ్రా
మించిచెలంగుచున్నకలిమింజెలి మంజువుమందహాసమున్
గాంచనచేలభూషణవికాసముఁగన్గవఁజూచు వేడుకన్.

క. ఉన్మీలిత నేత్రుండై
తనోన్మహనమూర్తిఁగనక తహతహపడుచున్
దన్మహిమ మెఱుఁగ కునికిన్
జిన్మయు వెదకుచు సరణ్యసీమఁదిరుగుచున్.

క. చింతితఫలదాయక ! నినుఁ
జింతించినమన్మనోబ్జ సింహాసనమం
దింతకు మున్నిలిచి సనుం
జింతల పాల్జేయ నెందుఁజేరితివి ? హరీ ! !

క. నీదివ్యమూర్తి నెదలో
నేఁదనివిజనింపఁజూడ నేరనయితి; నిం
కేది యుపాయము నినుఁగన
శ్రీదయితా ? భక్తవరద ! శ్రితజనపోషా ! !

ఉ. ఒక్కఁడదిక్కుమాలి యమితోగ్రవనంబుననున్న నన్ను నీ
వక్కటికంబునన్మనుతువంచును బుట్టెఁడునాసనంటి నే
నక్కట ! మన్మనోరథములన్నియు నాఱడివోయెనింక నా
కెక్కడ నిన్నుఁగాంచినుతియించెడు భాగ్యముగల్గు శ్రీహరీ !!

ఉ. అచ్చపుఁబత్తినిన్గొలువనైతినో ? తావకదివ్యనామమం
దిచ్చవహించి వాకొననో ? యేయపచార మొనర్చినానో గా
కచ్చపడన్వదీయ విమలాకృతిలోఁగనికన్నుఁదమ్ములన్
విచ్చికనుంగొనంగఁగనుపింపక యుందు వెయుందు శ్రీహరీ!

సీ. విధివిహితంబ వారిధిఁ జొచ్చి మెలఁగుట ?
కొండక్రిందను జేరిపండుకొనుట ?
విబుధేచ్ఛ యగున ? భూవివరంబుదూరుట
రూపించిపలుక ద్వయరూపినగుట
పారమార్థికము ? తోఁలుదప్పి నడచుట
పలుమాఱులిగి భువిఁబరుగులిడుట
సుమనోభిమతమ ? దుర్గమవనంబుననుంట
కడలియింటను గానఁబడకమనుట

ధరణిసర్వజ్ఞసంతమాన ? దారురూపుఁ
గనుట నెఱికల్కియొడలును గదిసిచనుట
భక్తవితతింబు నీయునిక్కపట్టుగుట్టు
రట్టుసేయక నాకుఁగనవ్వట్టు మీాశ ! !

క. అని సర్వాత్మకు నుచ్చ
స్వనమలరఁగఁగంఠమెత్తి ప్రార్థించుచు న
వ్వనిఁదరుగిరి సరసులదరి
వినతాత్మజవాహుఁజూడ వేడుకపడుచున్

ఉ. ఓ పరమేశ్వరా ! యెచటనుంటివి కంటికిఁగానరాక ? ఏ
పాపముపుణ్యమే నెఱుఁగ బాలుఁడనిన్నలుమాఱుపిల్వఁగా
నోప నరణ్యరోదనమయో ? యిఁకనామొఱ నెట్లువిందువే
నేపగిదిన్నినున్గనుదు నెట్టి యుపాయముదోఁచదయ్యెఁగా ?

శిశువునకా కాశవాణియుపదేశము

చ. అనిపలవించుచున్దిశల నాతుఁడై గనుచున్ననన్ననన్
వినెనొకచోట "కుఱ్ఱ! విలపింపకు శ్రీహరిఁగాంచఁగోరి ప్రొ
ద్దునఁ జలికోర్చి కుంకుపరదున్ స్మరియించుచునీజలంబులం
దునమకరంబునందురవిదోషహరుండిదిమాఘము" న్నుడుల్

ఉ. ఈయుపదేశవాక్యముల కెయ్యదికారణమన్విచారమే
చేయకవిశ్వసించితొలిఁ జేసినపుణ్యవిశేషసంపదన్
మాయురె! నాలుగేఁడులకుమారుఁడువిన్నవిధంబునింత మున్
బాయకచేయఁబూనె భగవంతునిఁగన్నులఁజూచు వేడ్కనై.

సీ. తెలవారకెలెమ్మను తలిరీతిఁబ్రకృతి పి
ట్టలకూఁత మేల్కొల్ప వెలయుచుండ
కాల్యంబులోనరింపఁగాఁదెల్పు తండ్రినాఁ
బ్రాభాత వాయువువజలుచుండ
తమమెడలించు విద్యాగురూక్తులమాడ్కి
నరుణచ్ఛటలు దిశలలముచుండ
విడలేనికూర్మిసంగడి కాండ్రవలెఁబనుల్
వడిఁజేయ స్వావయవమ్ములుండ
పూర్వపుణ్యంపురాశి తోఁబుట్టునట్లు
తన్నునడుపంగ శ్రీహరిధ్యానపరత
స్నానమొనరించి దోయిటజలముఁదెచ్చి
తులసికర్పించు మాఘమందునతండు

## బాలునికి శ్రీహరి సాక్షాత్కరించుట

చ. హరియునుఁజిన్నవాని హృదయంబుననున్నతలంపునింప సుం
దరవరశంఖచక్రవరదాభయ హస్తచతుష్కుఁడై యెదన్
సిరివనమాలకౌస్తుభముచిహ్నములొప్పారుమీఱుచుండఁగా
గరుడునితోడఁ జేరె సరిగాఁదులసీతరుగుల్మవాటికన్.

తే. చేరియటఁబూజనాదులు చేసియున్న
సమయమున బాలునెదుటసాక్షాత్కరించె
మాఘశుక్ల చతుర్దశిన్మహిమతోడ
ధ్రువునకున్బోలె భక్తబాంధవుఁడుగాన.

ఆ. మున్నుఁగన్నుమూసి కన్నట్టివెన్నునిఁ
గన్నుఁదెఱచిచూచెఁ జిన్నిబిడ్డ
తన్నుఁగన్నవారిఁ దానెఱుంగకయున్నఁ
దన్నుఁగనర ? జగముగన్నవారు.

వ. ఆసమయంబున.

చ. కనులనుజూడఁగల్గితిని గాయని నెమ్మదిఁగన్నసంతసం
బునుజిఱునవ్వుమోము వెలిఁబుచ్చఁగ విష్ణునిదివ్యవైభవం
బునుమదినచ్చువేయువిధమున్ గనుఁదమ్ములవిప్పిసూప నే
మనఁదగునోయెఱుంగమిఁగరాంజలిదెల్పఁగనిల్చెబాలుఁడున్

చ. నిలిచినబాలుశీర్షమును నీరజనాభుఁడు దాఁకెఁబ్రీతిమై
వలమురితోడ నంతభగవంతుఁనుతించెనతండు వేవిధం
బులనిగమార్థవాక్యములమోఘముగాస్ఫురియింపనయ్యెడన్
గలుగుసునందనాదుల మనంబులకబ్బురమై చెలంగఁగన్.

క. అదియిదియని యనఁబడనిది
తుదిమొదలని సకలమెపుడుదోఁపించుచునె
య్యెదిమెలఁగి చెలఁగి వెలయఁగ
నదియిదియని తెలియనగునో ? యదినీవకదా !

దండకము :- శ్రీ వాసుదేవా ! ప్రకాశస్వభావా ! సదానందభావా ! మహాదేవ ! నేనిన్ను నాకన్నులంజూడఁగా వేడఁగా వేడఁగా నేడు శ్రీదేవితోఁగూడ శ్రీవత్సచిహ్నంబు శ్రీకౌస్తుభంబుల్ విడంబంబు శ్రీవైజయంతీసరంబున్ దృఢంబున్ శుభంబున్ విశాలంబునౌనీయురస్థానమందేవసింపన్ వరింపన్ ధరింపంగనీకౌన్ జగంబుల్ భరింపన్ హరింపన్ గదాశంఖచక్రాదులన్ నాల్గుహస్తంబులందాల్చి లోకంబులన్నిల్చి, దుష్టాత్ములంగూల్చి, శిష్టాత్ములన్ రక్షణంబొప్పఁగాఁజేయఁగా మాయగాఁడీతఁడేయౌననన్ నిశ్చయంబౌనుకాదంచు వాదించువేదంబులందించుమించై ప్రవర్తించునీసంచునెంచంగ నీప్రాపుగాంచంగ నీవైసుఖింపంగ వేదాంతముల్ లూన్నపు తోఁపకల్పడుందాపు సందేహముల్బాపుఁగాన న్ సమస్తంబు నీవైచెలంగన్ మెలంగన్ దలంపుండెనేనేనరుండేని గానీ యధిష్ఠానమందేగదాకల్పనంబౌ సదా యన్నబుద్ధిన్ బ్రసిద్ధిన్ విచారించిముక్తుండగున్ వేవిరక్తుండగున్ నీకుభక్తుండగున్ సర్వదానిర్వచింపంగరానట్టి, నీకన్న భిన్నంబుగానట్టి నీశక్తినింబుట్టుచున్ బెర్గుచున్ గిట్టుచున్నట్టుగన్పట్టుచున్ బట్టిచూడంగ రజ్వాదులందున్ ద్రికాలంబులందున్ భుజంగాదులెందున్ యథార్థంబుగాలేవొ? యట్లేప్రపంచంబుమిథ్యాప్రసక్తంబసత్యంబు

సత్యంబుగాఁదోఁచుచున్నట్టిదైనన్ ననుఁబోటియజ్ఞానులం
బట్టి సుజ్ఞానులెల్లఁ గతజ్ఞానులై పోవఁగానీక కాపాడఁగాఁ
గాక వేఱొక్కలాభంబు నీకెన్నఁగానున్నదా ? నారదాది
స్వరూపంబులుగ నామముల్ నిన్ను నీకన్న వేత్తైనుతింపంగ
శ్లోకముల్ వినంగ న్గనంగ న్గదుంగా ! విశేషంబులీవేషముల్భా
షలున్భావలున్ సర్వసంతోషముల్ పాపసంశోషముల్
జన్మనిశ్శేషకృముల్ గాఁదలంతున్మదిన్ శ్రీహరీ! పూర్ణకారుణ్యపీ
యూషవర్షూరీ! నను న్బ్రోవఁగావచ్చినావా! నమస్తే నమస్తే నమః

శా. కారుణ్యామృతపూర పూరితకటాక్షశ్రీలు నాపై నిటుల్
ధారాళంబుగఁబర్వనన్నిట జగన్నాథుండవై గాంచఁగా
శ్రీరామామణి నారదాదులును వేంచేయంగ సేవింపఁగ
న్నారన్గాంచినయట్టి ధన్యుఁడనహో! నాభాగ్యమే భాగ్యమౌ

క. అనుచును శిరమునముకుళిం
చినకరకమలయుగము వికసించిన మొగమున్
గనుఁగవ నానందాశ్రు
లును నొడలున గగురుపాటులుం గలవాఁడై.

క. బాలుఁడు తన్మయుఁడై శ్రీ
లోలునిఁజిన్మయుని మనములోన వెలినిదా
నాలోకించుచుఁ బొగడెను
లోలాక్షీ ! బత్తు చిన్నెలుం గనుగొంటే !

ము. పరమేష్ఠిప్రభృతుల్ప్రొనర్చు నిగమప్రస్తోత్రముల్మెచ్చఁబో
ని రమానాథుఁడు బాలభక్తమృదువాణీ సంస్తుతిన్మెచ్చి శ్రీ
హరినేఁ గోరువరంబులిత్తుననఁగా నాతండు నాకిమ్ము నీ
చరణంబే నితరంబు వేడననుచున్ సాష్టాంగుఁడై మ్రొక్కినన్

క. వరదాభయకరములతో
హరి కుఱ్ఱని లేవఁదీసి హర్షమెలర్పన్
సిరి గరుడనారదాదులు
కరమాశ్చర్యమునఁ దేలఁగా నిటులనియెన్.

క. వత్సా! నీకును మామక
పత్సేవానందమిడుదుఁ బాలింపుమిలన్
సత్సాంగత్య బలంబున
వత్సరములు వేయి పుత్రపౌత్రయుతుఁడవై.

తే. అర్కకులుఁడు సులక్షణుండంగవిభుఁడు
శతసతీయుతుఁడయ్యును సుతులఁగనమి
ఋషులొసంగిన శ్రీఫలంబును భుజించి
నిన్నుఁగన్నది యతని కనిష్ఠపత్ని.

ఆ. సవతిమందువలనఁ జావకనీతల్లి
చిత్తవిభ్రమంబుఁ జెందియడవిఁ
బ్రసవమయ్యెనిన్ను వదలిపోనొకపులి
వాతఁబడెను దెలియఁబడ దెవరికి.

తే. అంచలోకయే డడవిని నిర్జించుటయును
సంత రెండేడులోకముని కాంతలిర్వు
రెలమిఁబోషించి కలహించియుండువిడుచు
టయును స్మృతిగలదె పసిబిడ్డనికి నీకు

చ. తనయులఁగాంచుయత్నముపృథాయయినంతదురంతచింత చే
మనమున రాజకార్యములమాటఁదలంపక యున్నవాఁడునీ
జనకుఁడు సార్వభౌముఁడిలసర్వమునేలఁగఁజేయునిన్నుఁ దాఁ
గనిముదమందినీవుచనఁగాఁదగుఁబొమ్ము సునందుతోఁ నన౯.

తే. చిన్నవాఁడయ్యు శ్రీవిష్ణుఁడన్నమాట
వినియుడిగె దేవ ! నన్నుఁబంపింపఁగలవు
పోఁగలనెనేను నీవున్నపురికిఁగాక
జనకుఁడే లెదు సంగ దేశమునకిపుడు.

క. మాఘుస్నానమునంబా
పోఘముఁబాసి నినునేనహో ! కనులార౯
మేఘశ్యాముని( గని యిది
రేయీ ఘనమనియెంచటికెట్టు లేగఁదగుహరీ ! !

క. ధరణీపాలన కర్మము
పరమార్థము రాజులకును బరికింపంగా
హరిభజనము రాజ్యాంతే
నరకంధ్రువమనెడినుడి వినంబడుఁగా దే.

ఆ. ఇంతబ్రతుకుబ్రతికి యింటివెన్కనునక్కె
నన్నుసామెత కరయంగ నేను
లక్ష్యమగుదునేమొ ? లక్ష్మినాథ ! శ్రీమోక్ష
లక్ష్మివిడిచి రాజ్యలక్ష్మినేల.

మ. సరసీజాసనుఁడాదిగాఁగల సమస్తప్రాణిసంతానమున్
చిరకాలంబుసుఖంబుగా మనుప శాసింపంగనీకౌను; వే
దరహస్యంబు నెఱుంగ నెవ్వనికి సాధ్యంబౌను నీకన్ననా
కరయన్దల్లియుఁదండ్రి లేరు జగదీశా ! నన్ను మన్నింపుమా

శా. అన్నన్యోమ్ముఁడనున్ యథార్థములు నీవన్నట్టివాక్యంబులో
యమునా ! వేదరహస్యమున్ దెలియఁజేయంబూని నేనిట్లు నీ
కన్నారన్గనునట్లుతోఁచితిని మాఘస్నానపుణ్యంబునన్
నిన్నిల్లోకము నేలు పొమ్మనితి సందేహంబులేదింతయున్.

చ. క్రమమునఁ బుణ్యపాపముల కార్యముతో సుఖదుఃఖసంతతుల్
నిమసముబీసపోవక జనిన్మరణించెడుదాక వేచెడున్
తమమురజస్సుసత్త్వములతత్త్వముఁ దత్త్వమెఱుంగుజీవులన్
సమతభజించి దేహములబాధలు దోడుగఁగూడియుఁజెడున్.

ఉ. కావునజంతుసంతతికిఁ గర్మఫలంబును దీసివేయఁగా
దేవుఁడులేఁడు కాని నరదేహమునందువివేకముండి మే
ధావియొకండు సర్వమును దైవవశంబని దేహధర్మమే
దోవిధిలేక చేయును మదుక్తినిభక్తి నిమగ్నచిత్తుఁడై.

క. ననుఁ గని రాజ్యము లేలియు
జనపాలురు తుదినిరాదు సాన్నిధ్యంబున్
గనియున్న వారు మఱియును
సనఘాత్ములు వారివంశ్యు లగుదురు వత్సా

క. అనవినిమదిఁగల సంశయ
మునువదలిన బాలునదనమును బరమకృపా
వననిధి శ్రీపతిగని యను
సునందుఁడను పార్శ్వవర్తిఁజూచి నగముతా

క. "వడి నిబ్బుడుతనిఁ గైకొని
విడుమునులక్షణుని సభనువిన్పింపుము లో
గడ జరిగినతత్కథ నే
నుడివినగతి మఱలిరా ననుం గలియంగన్"

క. అనుచున్ శ్రీహరిసిరితో
వినతులనందఱను గరుణవీక్షించుచుఁ జ
య్యన గరుడునిపైఁజనియెన్
సనకాదు లదృశ్యులగుచు సన్నుతిఁజేయన్.

ప్రహ్లాదుని మఱల [illegible]

ఉ. అంతసునందుఁడర్భకు రయంబుననాతని తండ్రితో సభా
భ్యంతరసీమఁజేర్చి హరివాక్యములన్వినిపింప నెల్లర
త్యంతముదంబునందిరి నిజాత్మజుఁగాంచి సులక్షణుండు ని
శ్చింతహరిన్ స్మరించి నుతిసేసి సునందుని మ్రొక్కి పంపినన్.

తే. చనిసునందుఁడుఁడా సులక్షణనృపాల
సభనుబోలునివిడుచుట జరిగినకథ
వినినజనకాదులతనిఁ గైకొనిముదంబుఁ
గనినుతించుట హరితోడమనవిఁజేసె.

వ. అచ్చటసులక్షణమహీపతి శ్రీపతిసంపూర్ణ కృపాపాత్రుండై నష్టధనంబురీతిఁ దనకుఁబ్రాప్తించిన కనిష్ఠసతీసుతుని నెత్తి ముద్దాడితొడలపైఁ గూర్చుండఁబెట్టుకొని ప్రేమాతిశయం బునఁగనులవెంట జలజలరాలుహర్షాశ్రువుల రాజ్యాభి షిక్తుంజేయుగతిదడుపుచు నతనిచెక్కుటద్దంబులుదుడుచుచుఁ జిఱుగడ్డంబుఁబుడుకుచు బుడుతనియడవినిఁగడచిన దినచ ర్యలు మగుడవినఁదలఁచియడుగు సభాసదులకు నెడనెడ బదులునుడువుచు విడఁవలేనికూర్మిపడఁతుకలనడతలకు నెడఁద దడఁబడవడిగవిడఁదలఁచుచుఁ బడరానిపాట్లుపడిచెడక భగ వంతుని కృపంబడసి సంసారదుఃఖసాగరంబునఁబడి మునుం గుచుఁదేలుచుఁ దరిఁగానకపరితపించు చున్నమమ్ము నుద్ధ రించిదరిఁజేర్పఁ దెప్పనలెవచ్చితివితండ్రీ ! ! యని పులకిత గాత్రుండై నేత్రంబులుదుడుచుకొని యొడిలోనిబిడ్డనిదిల కించి యడవినిరాయంచలతనిఁ బెంచినకథఁదలంచుకొని చిన్నికుఱ్ఱనిముద్దుపలుకులు విననెంచితండ్రి యిట్లనియె

తండ్రికొడుకుల సంభాషణము

క. పులుఁగులు మృగములు గానం
దలిదండ్రులులేని నిన్నుదయఁగొనిపెనుపఁ
నలినాక్షుఁడిట్లు నాకడ
కలర నినుబనుపు టనుగ్రహంబగును జుమీ ?

వ. అనినయ య్యర్భకుండు నిర్భయుండై భగవద్భక్తి స్వరూప గర్భితంబులగు సందర్భవాక్యంబులుతండ్రితో నిట్లనియె

క. తలిదండ్రులఁగల దైవమ్ము
పులుఁగుల మృగములను లేఁడె ? పోషింపఁడె దాఁ
బలువిధముల లోకంబులఁ
గలకాలంబత్తని కరుణఁగన వలెఁ దండ్రీ !

క. నాపుట్టు పూర్వాపరములు
శ్రీపతికరుణించి తెలిపి శ్రేయఃపదముఁ
బ్రాపింప ముముక్షుఁబుణ్యులు
నీపగిది స్థిర్పుచలెన నెన్నఁ దండ్రీ.

ఉ. సత్వరజస్తమంబుల ప్రసక్తిజనించెడు కర్మబీజముల్
తత్వవిచారణానలబలంబునఁ గాకనశింపఁబోవు క
ర్తృత్వముఖాది ధర్మములుదివ్యులకైన మనుష్యులెన్నని
స్సత్వశరీరకర్మరులుసల్పుదురన్నియుఁ జిత్తశుద్ధికై.

క. అనిజనకా ! శ్రీరమణుఁడు
ననుఁగని బోధించె నే సునందునితోడన్
బనివడి వచ్చితి ననఁగా
విని సుతుముద్దాడితేఁడు ప్రేముడితోడన్.

క. ననుఁగన్నతండ్రి ! యీనుడి
నినుఁగన్నది విన్న వెంత నిర్వృతిగనునో
వనమాలి కరుణఁబడసిన
తనయుని నినుఁగంటినేను ధన్యుఁడననుచున్.

రాజుపుత్త్రునకు నామకరణాదులొనర్చుట

ఆ. శుభముహూర్తమందు శుద్ధిపుణ్యాహంబు
జరిపి పుత్త్రునకును జాతకర్మ
ధర్మరక్షితుఁడు సుధర్ముఁడనుచు నామ
కరణమొనరఁజేసె గురుఁడు తండ్రి.

వ. మఱియునబ్బాలునకున్నైదవయేటఁబుట్టువెంట్రుకలుదీయించి చెవులుగుట్టించి యక్షరాభ్యాసంబుగావించి యథాకాలంబున నుపనయనంబునొనర్చి గురుకులంబున సకలవేదశాస్త్రంబుల నభ్యసింపంజేసి నీతిమార్గంబుఁగఱపఁజేసి వినయాదిసుగుణసంపన్నుఁడగునతని గజాశ్వరథారోహణ పరిజ్ఞానకుశలుంగాఁజూచి షాడ్గుణ్యాదిరాజధర్మంబులదక్షుండై యుక్తవయస్కుండైన పుత్త్రుని యువరాజుంగావించియున్నంత.

క. ధన్యుసుధర్మునిఁగాంకే
నన్యునిఁజేపట్టననుచు నఖిలసుగుణసౌ
జన్యాభిజాత్యయొక రా
జన్య సుతవరించెనతని జగమునుతింపన్.

సీ. శ్రీవిష్ణుమూర్తి దర్శించినధన్యుని
శ్రీదేవికనక వరింపఁగలదె?
పశుపక్షులడవిఁబెంపఁగవృద్ధిఁగను ఘను
బ్రకృతియగాక చేపట్టఁగలదె?
జలసేచనమున శ్రీతులసీకృపాపాత్రు
ననఘాత్మగాక పెండ్లాడఁగలదె
సార్వభౌముని సులక్షణాతనయుని రాజ్య
లక్ష్మిగాకెడఁదఁదలంపఁగలదె?

అను చులోకంబుగొనియాడ నాలతాంగి
పట్టమహిషియునయ్యె నృపాలురెల్ల
సంతసింపంగఁబుత్త్రి రాజ్యంబునందు
నిలిపి పట్టాభిషేకంబు సలుప దఁడి)

మ. వినవేపార్వతి ! నూర్వురాంధ్రుగలపృథ్వీపాలుఁడై సంతతిన్
గనలేకిట్లులభించివట్టి సుతుఁడొక్కండీధరాపాలనం
బునకర్హుండుగఁజూచి సంతసిలి యంభోజాక్షుకారుణ్యమే
తనుఁబ్రేరేపవనంబుఁజేరె నిజకాంతల్వెంటరా నాతఁడున్.

క. జనకుఁడు వానప్రస్థం
బునఁగాలముఁగడుపుటెఱింగి పుత్త్రుఁడు పిత్రా
జ్ఞను రాజ్యంబును బాలిం
చెను శ్రీభగవత్కృపా విశేషబలమునన్

సుధర్ముని రాజ్యపాలనము

మ. ఆసుధర్ముని రాజ్యమందున నందఱున్ సుఖవంతులున్
భాసమానవిలాససద్గుణవంతులున్ ధనవంతులున్
వాసియుందనురక్తులున్ భగవత్పదాంబుజ భక్తులున్
మోసగించుటయందశక్తులు పుణ్యపాలనయుక్తులున్.

తే. ఋషి పితృప్రాణములను దీర్చి సకల
జనులమాఘవ్రతంబును సలుపఁ జేసి
పుత్త్రపౌత్త్రులతోఁ దాను ముద మెసంగఁ
జేయుచునుఁ డేఁడు సుఖముండె శ్రీపతికృప.

చ. వనమునఁ దండ్రి యోగమునఁ బ్రాణములం దొగిఁ జియింపఁ దల్లియా
తనితనుఁ బుష్పహించి విహితంబుగఁ దారనుగంతృలై రి నా
విని తనయుండు వారలకు వెంటనె యుత్తరసంస్క్రియల్ పొన
ర్చెను దలిదండ్రులా హరినిఁ జేరఁగ సంశయ మేమి యద్విజా.

తే. దివిభువిసుకీర్తి విశదమై తేజరిల్లఁ
బరమధర్మంబు ముఖ్యమై పరిఢవిల్ల
సర్వజనులును సుఖులునై సంతసిల్ల
నాసుధర్మాఖ్యసార్థక మగుచుఁ జెల్ల.

క. శ్రీవిభునాజ్ఞను రాజ్యము
భూవిభుఁడై పంచియిచ్చి పుత్త్రుల కెల్లన్
శ్రీవాసుదేవ భజనము
సేవామాహాత్మ్య మెఱుఁగఁ జేసె నగసుతా !!

తే. మున్ను భరతాదులకు ఋషభుండువోలె
నిశ్చలజ్ఞానవైరాగ్య నిశ్చయంబు
భక్తిమార్గంబు బోధించి పరమయోగ
నిష్ఠఁ జనె సుధర్ముఁడు హరినిలయమునకు

తే. శ్రీమహావిష్ణుమహిమంబుఁ జెప్పఁగలనె
యెన్నిసారులునన్ను మోహింపఁజేసె
నతనిసామర్థ్యమును మాయ యందు రదియు
నతఁడునొకటిగాదోఁచుటె యరయమాయ.

తే. మకరమునసూర్యుఁడుండంగ మాఘమందు
స్నానమొనరించి శ్రీసులక్షణనృపాల
సుతుఁడు శ్రీహరికృపఁగని ఘుతనిఁజేరె
మాఘమాసవ్రతహితుండు మాధవుండు.

తే. అనిశివుఁడుపార్వతికిఁజెప్పినట్లు నైమి
శమున సూతుండు వినిపించె శౌనకాది
మునుల కీకథ శ్రద్ధతో వినిన జనుల
కగును బూర్ణాయురాది భాగ్యంబులనుచు

ఆశ్వాసాంతము

ధృ. పరమపావనరామనామజపప్రధాన సుజీవనా !
నిరుపమానమతిప్రసాధిత నిర్మలాత్మసుఖోదనా !
తరుణభాస్కరబింబభక్షణ ధైర్యసాహసభావనా !
నిరతతావకపాదసేవన నిష్ఠభక్తజనావనా !

మణిరంగ. వాయునందన ! వాసవవంద్యా !
ధ్యేయరూప ! విధీశ్వరవంద్యా !
న్యాయకోవిద ! నందితమిత్రా !
మాయికాక్షకుమారక జైత్రా !

భద్రిక. జానకీకుశలంబు భూ
జానికిన్ వినిపించి వే
మానసీయుఁడవైతి ప్ర
జ్ఞానివై హనుమత్ప్రభూ !!

గద్య. ఇది శ్రీ ప్రసన్నాంజనేయ వరప్రసాదితాన ఎద్యహ్యాద్య
వినయవివేక విద్యాసంపన్న ప్రతాపనఁశోత్పన్న ఆశ్వ
లాయనసూత్ర ఆత్రేయసగోత్ర పవిత్రఆదెమాంబా
రామయసూరి సుకృతదంపతీ జ్యేష్ఠపుత్ర అన్న
పూర్ణాకళత్ర సుజనవిధేయ హనుమయాభి
ధేయ విరచితంబయిన శ్రీ సులక్షణో
పాఖ్యానంబునఁ దృతీయాశ్వాసము
సర్వము సంపూర్ణము.
శ్రీ పరమేశ్వరార్పణమస్తు



# బ్ర॥ శ్రీ॥ ప్రతాప హనుమయ్యగారి రచనలు

## అచ్చయినవి

1. శ్రీ ప్రసన్నాంజనేయము
2. శ్రీరామ వైరాగ్య కందములు
3. శ్రీమద్గురు స్తోత్రము
   శ్రీ జగద్గురూపదేశ సారము.
   అద్వైత తారావళికి తేట గీతానువాదము
   తెలివి బ్రహ్మము
   జాయ (పెండ్లాము) మాయ
   మాయా ప్రశంస
4. శ్రీ వెన్న కేశవశతకము, కళ్యాణము
5. శ్రీ సులక్షణో పాఖ్యానము.

## అచ్చు కావలసినవి

6. శ్రీహరి శతకము
7. శ్రీ వీరాంజనేయము
8. శ్రీ భ్రమరాంబా మల్లేశ్వర శతకము
9. 'పచ్చిస' ఆటయందలి పరమార్థము
10. 'శ్రీ వేదోద్ధారక' శ్రీ రామచంద్రేంద్ర సరస్వతీ యతీంద్ర సద్గురు పూజా కథా కల్పము
11. కవితాప్రసూనములు

## శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారి రచనలు.

| | | |
|---|---|---|
| 1 | శ్రీ మద్గురుభాగవతము-11, 12 స్కంధాలకు 3 వేల పద్యాలు | 5-0-0 |
| 2 | శ్రీ మద్భాగవతమహిమ 6 ఆశ్వాసాలు | 1-8-0 |
| 3 | శ్రీ దత్తమహిమ - సులభమైనవచనము 450 పేజీలు | 2-0-0 |
| 4 | సూక్తినిధి - 4ఆశ్వాసాలు కమ్మని పద్యాలు | 1-8-0 |
| 5 | రామదాసు - వచనము | 0-6-0 |
| 6 | అడవిపువ్వులు - చక్కని నీతులు | 1-0-0 |

మిన్నిగంటి గురునాథశర్మ
ఆశ్రమం; బ్రాడీపేట 5వ లైను
గుంటూరు - 2.